హిత (సర)తం సాడిగాఖ్యం సమాఖ్యాం తత్సూనుః సోమలః క్షవినుతసితయశః
శ్రీవధూప్రాణనాథః॥ త్యాగీసత్కవిబంధుసోజనో॥

౨౭ (ప) గతఃసత్యవ్రతాలేక్షతిద్ధగిరీభూతపరోపతాజవః జగద్విక్రాన్తలక్ష్మీప్రియః। సూత
స్వామ్యవిధేయ వైరిలలనా వైధవ్యదీక్షాగురు ర్బ్భర్గస్వచ్చంద్రకలావతంసశరణ
ధ్యానామలః సోమలః ॥ అనిందితాచారవిచారసాగః పరోపకారాదిగుణావతారః
విద్వజ్జనాధారప్రమాసనాధో విరాజతే॥

౨౮ సోమలదండనాథః॥ ఆవాససంమతకామధేనుః ప్రదాన * రో(పి)తకల్పవృక్షః। నిస
ర్గహభృంత(ధరా)గృహీతః ఖ్యాతః సతాం సోమలదండనాథః॥ యేనమహాత్మనా
సోమేశ్వరేక్కర్గగృహమా(ల్ల)కుణ్డం విష్ణోః ప్రతిష్ఠా * దేశ్వరా * * * స్యమల్లే
శ్వరసన్నిధానే కృతేతుత్తర(సో)మఠంచ * * * * (స)మ॥

౨౯ స్తరాజ్యభరసిమాపిత మహామాత్యపదవీవిరాజమాన మానోన్నత ప్రభుమంత్రో
త్సాహశక్తిత్రయసంపన్నేన శ్రీమన్మహాసంధివిగ్రహి మహాప్రచణ్డదణ్డనాయక
సోమలేన నిజపదావిధివిరా (జిత) రాజ్యాధిష్ఠానకొల్లిపాకపురే నిఖిల * * *
నాశ్రయ * * నిర్మ్మాపితజగద్దేవనారాయణపు॥

౩౦ రస్యఖట్టిస్పదాతనవసుధాకర్మ్మనిర్మ్మాణత్వం దేవాంగభోగరంగభోగార్థ్ద మని
జనస్వాధ్యాయాం ని(డు)నాత్త్రం శ్రీమచ్చాళుక్యవిక్రమవర్ష ఏకోన
త్రింశత్తమే తారణసంవత్సరే చైత్రపూర్ణిమాయా మాదిత్యవారే సోమ
గ్రహణనిమిత్తం * * * గ్రామమధ్యే
* * * * (పెం)బఱతినామగ్రామం పర్గ॥

౩౧ వంపురద్రమ్మ ౧౮౩ తి ఛత్రభాగే * దద్వయమప్పేశ్వరదీ (భట్ట) దత్తం పరిహృత్య
సర్వ్వభోగాభ్యంతరశుద్ధ * * భోగీకృత్య సర్వ్వనమస్య చాళుక్యచక్రేశ్వరత్రిభు
వనమల్లనరేశ్వరా * * జగద్దేవమణ్డలేశ్వరో * దత్తవార గ్రామస్యపరితః (22
అక్షరములు అస్పష్టముగా నున్నవి)। పశ్చిమతః దుడ్డెచెఱువు। దక్షిణతః ॥

౩౨ ఎఱ్ఱగుంట। ఉత్తరతః * డితాడితోటకరావి । కో * చారనేమసహస్రమధ్యప్రతి
గ్రామ ముత్తమమధ్యమాధమక్రమేణ పంచచత్వారిత్రీణ్యుత్తమగణ్డ (చి)ంనాని
దేవభోగీకృత్య దత్తవాన్ * * * తద్దైవపట్టనే * * ఏహ * * మానిరాజ్యం
ప్రతశ్వః మాలాకారిపూజ్యః * సగోత్రత్రయందత్తవాన్॥

33 దేవస్యపుఃపదాత్ర పలావల్య త్తన * * * * వాడికాష్ఠే సత్రందత్తవాన్॥ ఏవంవా దిత్యేభ్య * ధర్మ్మం నిర్వ్విశేషం శ్రీమానరపతినా దేశాధికారభిశ్చపరిపాలనీయః॥ బహుబిర్వ్వసుధాదత్తా రాజభిః సగరాదిభిః। యస్య యస్య యథా భూమి స్తస్య తస్య తథాఫలం॥ స్వదత్తాం పరదత్తాం వా యోహరేత వసుం॥

3౪ ధరాం షష్టింవర్షసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥ తతురామచంద్రేణాప్యుక్తం। సామాన్యోయం ధర్మసేతు నృపాణాం కాలే కాలే పాలనీయో భవద్భిః। సర్వ్వానేతా న్భావినః పార్థివేంద్రా న్భూయో భూయో యాచతే రామచంద్రః॥ మద్వంశజాః పరమహీపతివంశజా వా పాపాదపేతమనసో భువి భావి భూపాః॥

3౫ తేపాలయన్తి మమధర్మ్మ మిమం సమగ్రం తేషాం మయా విరచితోంజలి రేషమూర్ద్ధ్ని॥ శత్రుణాపికృతో ధర్మ్మః పాలనీయః ప్రయత్నతః శత్రురేవ హి శత్రుస్యాద్ధర్మ్మశ్శత్రు న్నకస్యచిత్॥ అన్యచ్చ శ్రీమజ్జగద్దేవనారాయణదేవియభాణ్డాగార (సువర్ణ) న రామలచెఱువు॥

3౬ గ్రామబడ జగద్దేవమహీపతి * మతపగ్రమశాదాగశాతా * త్తమమనివర్త్తనదశక మస్యదివససవనమస్య మాచంద్రార్కస్థాయి * తిపూర్వ్వం * * * తాఃగగం * డిదతానం * వాలయేతతః * * * * * వవేరవితవా॥



# ఇతర శాసనములు

## 1

### ఒరంగల్ శాసనము

౧ ప్రమాదిసంవత్సర మా
౨ ఘ శు ౧౦ వ। గజపతిక
3 పిలేంద్రమహారాయ
౪ ల కుమారుండు రా
౫ చ్చిదేవకుమారమహా
౬ పాత్రుండు వారుంగ్వ *
౭ కోట గొనెను

## 2

### నేలకొండపల్లి శాసనము

౦ సూర్యుఁడు–లింగముపానవట్టము–చంద్రుఁడు

౧ స్వస్తి శ్రీశకవర్షం (బు)
౨ లు ౧౦౪౭ అగు మన్మ
3 ధసంవత్సరముమం *
౪ శ్రీమన్మహామండలే
౫ శ్వర కందూరిరుద్ర
౬ యనచోడమహా
౭ రాజు రాజ్యాన గొండ
౮ పల్లి పెద్దచెఱ్ఱువనకు
౯ గటితూమువద్దన
౧౦ * * * పొలము
౧౧ వద్దికి మఱ్ఱురిచే
౧౨ ండు ఆనాయకనాథ
౧3 నాయకుడు శ్రీమహా
౧౪ విశ్వేరదేవర కడ
౧౫ త్తూరనిదేవునికి
౧౬ చ్చిరి ఆచంద్రార్క
౧౭ ముగాను।

## 3

### నేలకొండపల్లి శాసనము

మొదటివైపు

ఖడ్గము, గోవు, పాలుద్రావు దూడ

౧ శుభమస్తు స్వస్తి శ్రీ
౨ శుభజయాభ్యుదయ
3 శకవర్షంబులు ౧౪౭3
౪ అగు నేంటిఖాత్రుసంవ

౫ త్సరజ్యేష్ట శు ౩ ఆక్రిష్ణదే
౬ వరాయమహారాయ
౭ లుంగారు పృథివీరాజ్యం
౮ చెయ్యంగాను। రాయసం
౯ కొండ్డమరుసయ్యంగా
౧౦ రు పెదకొండ్డపల్లినుండి
౧౧ కృష్ణకీవల తానుపాలిం
౧౨ స్తు నుండిన కొండపల్లి
౧౩ దేవాదులకుం జేయించి
౧౪ సధర్మశాసనము——తత్
౧౫ పూర్వానను కొండపల్లిప
౧౬ ట్టనాను పల్లెలాను రంగాన
౧౭ కూ కూనముగ్గుకూ। గట్టపడి
౧౮ నాను। బోనాలకు స్తితంరాజ్య

రెండవవైపు

చంద్రుఁడు, సూర్యుఁడు, పానవట్టము

౧ వారికంబెట్టిపయిం
౨ డి యెల్లకాలాల
౩ కున్నా సర్వమాన్యం చే
౪ స్తిమి క్రితంపూర్వాన
౫ పెదచెఱ్వువెనక వద్దిచే
౬ నుగాళ మాడ త్తి
౭ గాను బొల్లసము
౮ ద్రముపెనక నిర్ణీలపెన
౯ క పాతికెను వెలిపొ
౧౦ లంకు చ్చెలాను
౧౧ ఇ స్తిమిగాన
౧౨ ఆచంద్రార్కముగా
౧౩ ను దేవరఅవధరిం
౧౪ చ్చేది అనికొండ్డమ
౧౫ రుసయ్యంగారి ఆ
౧౬ నతినిగాని పర్వతయ్యం
౧౭ గారు శాసనంనిల్పిరి

మూడవవైపు

ఆంజనేయవిగ్రహము

౧ యీధర్మానకు ఇం
౨ ద్దులు తప్పిరా వారు
౩ కాశీలోను గోబ్రా
౪ హ్మణహాతం చేశిన పా
౫ పానం బోవువారు
౬ తురుకలు తప్పిరా ప
౭ ందిదిన్న దోషానికి
౮ బోవువారు.

---

## 4

### నాగులపాడు శాసనము

౧ స్వస్తి శ్రీశకఅభ్యుదయశకవర్షంబులు ౧౪౬౭ అగు నేంటి క్రోధిసంవ్వత్సర కార్తీక
బ ౧౦ గు॥ మెలీసుఖానింగారు (నాగు)

౨ లపాటిశీమ చెరకుందోంటలు ఆకుందోంటలు యీనాపుచేలు కొల్చియుండు ఈసైదు
మల్లుతిరుమల్లిఆలో సలిఖైరు వాజుర్ను సైదుగడా యీజాను

౩ సైదు చిమ్మనుబారనుచౌదరి చక్కబండినాగిరెడ్డి వట్నరెడ్డి యెలిరెడ్డి పటేలుబొాచ్చి
లొంకల తిప్పారెడ్డి పొట్టిముత్తుకృష్ణంరెడ్డి మారడిజుసోమిరెడ్డింగారి

౪ ముందరను వుత్తరోత్తరలు ఆచంద్రార్కముగాను యీబారను యిరవైబారలు బిగ్వ
క్రమాన తొమ్మిదిబిగ్వలుమత్తర్లు వ్రాసిన కులకరణి తడకమరశిరిదివ్రాలు.

---

# 5

## పా ను గ ల్లు శా స న ము

౧ వితానేకశ్రీకమభీకరం మ్మురిపో ర్దేవస్యమైలాంబికా

౨ * పిట్టమపల్లీతి నామానం మహితోర్వ్వరం। ద్విజేభ్యో

౩ ద్యమదాదర్థం భీమనారాయణాయచ। కల్యాణాభ్యు

౪ దమైకకారణ మయం సర్వస్య సాధారణో ధర్మ్మస్తద్గత

౫ మత్పరాఃక్షితిభృతో యేపాలయంత్యాదరాత్ ధర్మ్మం

౬ మత్కృతమి త్యుదారచరితా తాన్యావినే భూపతి *

౭ పే. ఖరితస్వహస్తకమలా మైలాంబికాయాచతే।

౮ శ్రీమద్భీమరాజనందన స్తాండక్షితీశోపి కద్య

౯ రువిషయే గ్రామం నాయకానుమత్య ప్రతిగ్రామం

౧౦ శాలిక్షేత్రనివర్తనద్వయం ఖారిపంచకచ యావ

౧౧ * * * *

---

# 6

## జ డ చ ర్ల శా స న ము

౧ శ్రీ నమశ్చంద్రశిరశ్చుంబి చంద్రచామరచారవే త్రై

౨ లోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే॥

౩ స్వస్తి సమధిగతపంచమహాసబుద మహా

౪ మండళేశ్వర వీరమాహేశ్వర కోడూపూర్వరవరేశ్వర (సూ)

౫ య్యర్య్వంశోద్భవ కులతిలక కాస్యపగోత్ర క
౬ లికాలాన్వయ నామాది సమస్తప్రశస్తి స
౭ హితం శ్రీమన్మహామండలేశ్వర కందూరిఉదయ
౮ నచోడమహారాజుల సుంకాధికారులు శ్రీమ
౯ తుకిబ్బట్టెమేల్వాట్ట (దం)డనాయక నల్లసిద్ధమ
౧౦ య్య అసిద్ధమయ్యలు శ్రీమ
౧౧ చ్చాళుక్యవిక్రమవసమములు ౧౦౮ గు చిత్రభా
౧౨ నసంవత్సర పౌష్యబహుళ ౨ మంగళవా
౧౩ రమునాండు ఉత్తరాయనసంక్రాంతి నిమి
౧౪ త్తమయి కోడూరిశ్రీస్వయంభుసోమనాథదేవ
౧౫ రకు రెండునందాదివియలకుం గ్గొసగి నివేద్యా
౧౬ నకుం గంగాపురమువద్ద సుంకాన నాచం
౧౭ (ద్రాక్షా) తారముం నడపముగాను నెలకూ (౫) సే
౧౮ సి కోడూరిగోకర్ణసింగ రూకలిచ్చిరి (ఇ)స్తళ
౧౯ ము సుంకానకు నెవ్వరధికారులఇ నడచినా
౨౦ ని అద్ధురూకలుం నెలనెలకుం జెడకుండా బె
౨౧ ట్టునది ఈ ధంమ్మ్రు వనుకూలురయి నడపినవారికి
౨౨ గంగ కురుక్షేత్ర వారణాశియందు వేయిగవిలల
౨౩ దానమునేసినఫలము. ఈధమ్మ్రువునడపక బా(ధ)
౨౪ (నేసిన)వారికి వేయిగవిలల వధనేసిన పాపము॥
౨౫ స్వదత్తం పరదత్తం వా యో హరేతి వసుంధరా
౨౬ షష్ఠివ్వర్షసహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః

---

## 7

### ఆలుగడప శాసనము

౧ వినాయకనమస్తుభ్యం సతతం
౨ మోదకప్రియం అవిఘ్నంకురు
౩ మే దేవ సర్వకార్యేషు సర్వదా।
౪ స్వస్తి సమస్తప్రశస్తిసహితం
౫ భండనఉత్తుంగతురగరేవం
౬ త పరబలసాధన పతిహితా
౭ చరణ గండరగండ గండభే
౮ రుండ సత్యహరిశ్చంద్ర శౌచ

౯ గాంగేయ శరణాగతవజ్ర
౧౦ పంజర సకలజనస్తుత
౧౧ పరనారీదూర బంధుచింతా
౧౨ మణి సుభటచూడామణి
౧౩ (సూ) ర్యోదయరాజ్యసము
౧౪ ద్ధరణ సకలవిద్యావినోద
౧౫ విభవపురందర వివేకచ
౧౬ తురానన విప్రజనాశ్రయ చ
౧౭ తుర్థకులకుముదినీరాజ్య
౧౮ వర్ధన చంద్రుండును అ
౧౯ య్యనరసింహ ఆదిమ
౨౦ (క్షితుండు) నిజభుజవిక్రమ
౨౧ గడికోటమల్ల మనుమ
౨౨ కులాభరణ శ్రీరామేశ్వరదేవ
౨౩ దివ్యశ్రీపాదపద్మారా
౨౪ ధకులైన పెనుమదుంగో
౨౫ త్ర పవిత్ర వడ్లూరిపురవరా
౨౬ ధీశ్వర నామాది ప్రశస్తిసహితు
౨౭ లైన శ్రీమతు గుండప
౨౮ నాయనింగారికి శడ్డులు ఎఱ్ఱమ
౨౯ నాయనింగారు స్వస్తి శ్రీశ
౩౦ కవరుషంబులు ౧౧౨౭ అ
౩౧ గు నేంటి ప్రభవసంవత్సర
౩౨ వైశాఖ శు॥ ౫॥ లునాండు ఆ
౩౩ లుంగడప తూప్పూదిక్కునను త్రి
౩౪ పురాంతకదేవరం బ్రతిష్ఠ శేశి
౩౫ రి స్వస్తిశ్రీమహాప్రధాని రా
౩౬ యస్థాపనాచాయ్యులైన [సిం] గ
౩౭ మదేవనాయంకులు ప్రతిష్ఠా
౩౮ కాలమప్పుడు త్రిపురాంతక
౩౯ దేవరకుం ఆలుంగడప రావు
౪౦ లచెఱువెనుక నుత్తరగొందుము తూ
౪౧ ముకు * వను అద్దానపెద్దతూ
౪౨ ముకాలువను వెలంపట్టాను
౪౩ ఆకాలువనె బెడ్డచేను ఆఱు
౪౪ వీసాలును వ్రిత్తిపెట్టిరి క్రం
౪౫ నాగదేవనింగారు చఱులోప
౪౬ లను తాడితోంటఇచ్చిరి శ్రీదే
౪౭ విరాజు సూయ్యగ్రహణకాల
౪౮ మప్పుడు చంద్రుచేని తూప్పు
౪౯ ను ఆంసూకదేవరగుడివాన
౫౦ కు నూకగానున్న మాడం
౫౧ గొల్లకుంచమున్న తవ్వేండు
౫౨ నూనె ఇచ్చెను.

---

## 8

### గంగాపురశాసనఖండము

౧ శశిభాస్కరా॥ హేరంబ స్సముదం కరోతు భ
౨ వతాం వప్రక్రియాబిభ్య త్సాన్ద్రతధీ * చ్ఛాయా నిరీక్ష్యాత్మనః
౩ పాతువః పద్మనాభస్య శయ్యాశేషఫణీశ్వరః చకితేవయతోలక్ష్మీ

౪ భూతిః పదారవిందాదరవింద యోనేః వర్ణో స్తురీయో బహు
౫ తత్ర తురీయో * * కథాచాతుర్య్యథాయోదయే వర్ణే
౬ వివాహవిధినామంభిదాంలతుశః శ్రేష్ఠ స్తేగు గరిష్ఠపు
౭ త్రోభంగై రహీనః పరం సత్యాకీర్ణ్ణ నిజాంతలోపి న
౮ వాసరై ర్యత్రానిమ ర్ధథితో నచాపి మునినా వీతస్న
౯ స్వాంశేతుసంజాతః సంతానః సర్వ్వకామదః॥ తత్రా
౧౦ వీరో వెన్నమహీపతిః॥ దోర్దండశాలినా
౧౧ లక్షీక చాయతే॥ త * * రభూ
౧౨ యాశోసీరంధ్రితా

# 9

## రామన్న పేట శాసనము

### మొదటి వైపు

౧ స్వస్తి శ్రీమన్మడలపాట్టి
౨ పట్టనసుధాకర సత్య
౩ హరిశ్చంద్ర యువతిజ
౪ నమనోహర వితరణగు
౫ ణసంప్పన్న విరణగెల్వ
౬ కూయాలింప ప్రజ
౭ మెచ్చుగండ పతిహితా
౮ ంజనేయ పరనారీదూర
౯ రణరంగవిజయ రణముఖభై
౧౦ రవ మూరుబెలపురవరాధీశ్వ
౧౧ రులైన శ్రీమన్మహాసామ
౧౨ ంతమల్రెడ్డి శకవర్ష
౧౩ ములు ౧౧౩౫ గు నేంటి
౧౪ శ్రీముఖసంవత్సర చై
౧౫ త్రశు ౩ గురువారమునా
౧౬ ండు మాటూరం దమత
౧౭ ండ్రిముప్పఱెడ్డిపేర గుడి
౧౮ గట్టించి ముప్పవిశ్వేశ్వరదేవ
౧౯ రం బ్రతిష్టసేసి ఆదేవరకు
౨౦ నంగభోగమునకు రాగభోగ
౨౧ మునకూం గొల్లబోయునిమె
౨౨ ట్టనియ్యేడియూ రాచంద్రార్కర్క
౨౩ * * * గా నిచ్చితిమి
౨౪ స్వభానుసంవత్సరవై శాఖమా

### రెండవ వైపు

౧ సమున నొల్లంబ
౨ ల్కులవెన్న శ్రీము
౩ ప్పదీశ్వర దేవర
౪ దివ్యకాంపు॥
౫ స్వదత్తాం పరద
౬ త్తాం వా యో హరే

౭ త వసుంధరాం ష
౮ ష్టిః వర్ష సహస్రా
౯ ణి విష్ఠాయాం జా
౧౦ యతే క్రిమిః॥ స్వ
౧౧ దత్తా ద్విగుణం పు
౧౨ ణ్యం పరదత్తాను
౧౩ పాలనం పరదత్తా
౧౪ పహారేణ సదత్త
౧౫ ం నిష్ఫలం భవేత్
౧౬ అకరస్యకరికా
౧౭ రం గోసహస్రకర
౧౮ దస్మృతః కరప్రవి
౧౯ త్రివిచ్ఛేదా ద్గోకోటి
౨౦ ఫలదం శ్రుణు॥ ద్వి
౨౧ షం త్రియే మత్సర
౨౨ లోభభాజో నరాఇ
౨౩ మంధర్మ మధర్మ
౨౪ శీలాః తేగోఘ్న మాతృ
౨౫ ఘ్న పితృఘ్న లోకా
౨౬ వ్రజంతి విప్రఘ్న
౨౭ గతిం చ యాంతి॥

మూండవ వైపు

౧ బహుభి ర్వసుధా దత్తా బహుభి
౨ శ్చానుపాలితా యస్య యస్య
౩ యదాభూమి స్తస్యతస్య త
౪ దాఫలం॥ మద్వంశజాః
౫ పరమహీపతివంశజా
౬ వా పాపాదపేత మనసా
౭ భువి భావిజాతాః యేపా
౮ లయంతి మమధర్మ మి
౯ మం. సమస్తం తేషాం మ
౧౦ యా విరచితాంజలి రేష
౧౧ మూర్ధ్ని

---

## 10

గార్ల శాసనము

౧ శ్రీవిశ్వేశ్వరాయనమః॥
౨ యే దేవా స్త్రిగుణాత్మకా స్త్రిపురుషా గౌ
౩ రీరమావాగ్వరాః । యోగిధ్యేయ సుమూ
౪ ర్తయ స్ఫటికనీలాంభోజరాగది (ప్ర) భాః ఆ
౫ ద్యావేదమయా స్సురాసురముని స్తుత్యా
౬ మహోఘోదుహో స్తే రుద్రాంభుజనాభ
౭ పంకజభవా రక్షంతు వ స్సర్వదా॥ ౧

౮ గజవక్త్రం మహాసేనం దేవీం చ కరుణాలయాం
౯ నత్వాహం శాసనశ్లోకాన్ వక్ష్యే సంప్రతితద్య
౧౦ థా॥౨॥ శ్రీభామినీపతేర్నాభి పంకజే ప
౧౧ ద్మభూ రభూత్ । తేనసృష్టమిదం సర్వ
౧౨ ం తత్రత్ర (మ్య) మహీతలే॥౩॥ నానాసే
౧౩ నాధిపాజాతా శ్చతుర్ధ కులవల్లభాః ।
౧౪ తత్ర రేచెర్ల వంశోభూత్ ఖ్యాతిమా
౧౫ న్బేతభూపతిః ॥౪॥ తస్యాసీ త్తనయో బొ
౧౬ ప్పయాంహ్వయః కులభూషణః
౧౭ తత్పుత్రో గణనాథాఖ్య స్తస్యసూను
౧౮ ః పరంతపః ॥౫॥ బొప్పరాయ ఇ
౧౯ తిఖ్యాత శ్రీమన్నామంత శేఖరః ।
౨౦ విశ్వేశపాదపంకేజ భ్రమరీభూతచేతసః ॥౬॥
౨౧ సంకల్పత్వేము పేహి పన్నగపతిః దేవ
౨౨ స్యశంభో స్సదా నిద్రాం సేవితు మ
౨౩ హసి క్షితిధరా క్షీరాంబుధి స్వేచ్ఛయా
౨౪ ఇచ్ఛాయ ద్యవగాహనే ప్రాదనదా
౨౫ న్గచ్ఛ ద్ధమాశాగజాః ః భూభారోద్ధర
౨౬ ణాయ సంప్రతి భువి శ్రీబొప్పరాయో
౨౭ స్వయం ॥౭॥ అతులితసితకీర్తి వ్యాపి
౨౮ తాశేషలోక స్వజనసుజనబంధుర్వ్రా
౨౯ త కల్పావనీజ (ః) । విభవవిజితశక్ర శ్చా
౩౦ రుచారిత్రపాత్రో । జయతి గుణవ
౩౧ రేణ్యః పుణ్యవాన్ బొప్పరాయః ॥౮॥
౩౨ సోపి నిశ్చలయాభక్త్యా నంతపుణ్యఫ
౩౩ లాప్తయే నిత్యసత్యవ్రతో వీర సర్వ
౩౪ ధర్మపరాయణః ॥౯॥ నవాంబ
౩౫ రద్వీపవసుధా ౧౨౦౯ సంఖ్యాక శ

౩౬ కహాయనే । విలసత్సర్వాజిచ్చైత్ర
౩౭ శుద్ధాష్ట మ్యబ్జవాసరే·గా
(మిగిలిన భాగము నేలలో పూడియున్నది. చాల గొప్పశిలగావున, ద్రవ్వింప వీలుకాలేదు)

---

## 11

### పిల్లలమఱ్ఱి శాసనము

౧ స్వస్తి సకలగుణాలంకార ఆంధ్రదేశాధీశ్వర పరనారీసహోదర
౨ అనుమనంగంటిపురవరాధీశ్వర చోడరాయస్తాపనాచార్య్య
౩ కాంచీరక్షపాలక విషమదాడిపాంచాల ఇదువెత్తంగండ
౪ గండ్డగోపాల మూరురాయజగడళ ఇత్యాది బిరుదాంకి
౫ తులైన కాపయనాయ్నింగారి ఇష్టబ్రిత్యుండు ఎఱపోతు
౬ లెంకంగారు పిల్లలమఱిని రాజ్యము సేయుచుండి త
౭ త్కాలదేశవిధ్వరాలను సురతాణిచేతను ఎఱకేశ్వరదే
౮ వర ఉపహాతిఅయితేని అల్యావదీను ఎఱపోతులెంకంగారు త
౯ న ఏలిక కాపయనాయ్నింగారికిన్ని తమతండ్రి అనుమకు
౧౦ ండమాచినాయ్నింగారికిన్ని తల్లిరుద్రసానింగారికిన్ని పు
౧౧ ణ్యముగాను శకవర్షాలు ౧ * * ౭ అగు నేంటిహేమళం
౧౨ బిసంవత్సర జ్యేష్ట శు ౧౫ గు॥నాండు పునఃప్రతిష్ఠసేసి
౧౩ రి ఆదేవరకు అధికపడి ఒకవూంట ఉపహారానకు పి
౧౪ లలమఱిని దేవరకుంటవెనకను వ్రిత్తి అడ్డచేనుపెటిరి

---

## 12

### కొఱవి శాసనము

తూర్పు

౧ శ్రీవిక్రమాదిత్యనృపా
౨ గ్రతనయుణ్డాయ్న చాలుక్య
౩ భీమునకు శౌచకన్దర్ప్ప
౪ సకు వేగీశ్వరునకు రన
౫ మద్దాన్వయకులతిలకు
౬ ణయ్న కుసుమాయుధుణ్డు గ

౭ న్నరబల్లహునికి స్వప్రాప్త
౮ ంబయ్యన్న రనమర్ద్దనక శ్రీమదన
౯ భుజవీర్య్య బలపరాక్ర
౧౦ మంబున న్దచ్చికత్తియంగట్టి
౧౧ పట్టంబెత్తి ఖడ్గసహాయు
౧౨ న్డై నేలయెల్లం గావంబూని
౧౩ మడికొణ్డనాణ్డాదిగ
౧౪ వేగిదేసము విష్ణువ
౧౫ ర్ద్ధనుతోనడ్డి రాజ్యంబుసే
౧౬ యుచున్న కుసుమాయుధుపె
౧౭ ద్దకొడుకనేకరిపునృపతి
౧౮ మణిమకుటమకరికా
౧౯ రేవణమశృణిత

ఉత్తరము

౧ గలరలావర్త్తంబురా
౨ జ్యంబుసేయుచు నిత్థవి
౩ షయకామభోగంబుల
౪ ననుభవించుచు సుఖంబు
౫ న్డి యొకనాణ్డు కొరవి నల్ల
౬ జెఱెయకొడుకు పెద్దన
౭ రావించి నీవునాప్రాణస
౮ మానుణ్డైన చెలివి నీ
౯ చేసిన యుపకారంబున
౧౦ కు బ్రత్యుపకారంబుసేయ
౧౧ వలయుంగాన నీకేమివ
౧౨ లయు చానివ * * *
౧౩ ణ్డి కొమ్మ నృగి
౧౪ శ్రీనాకెల్లంగలదేమి లే
౧౫ కున్న వెణ్డికొణ్డుమయ్యను
౧౬ బరోపకారంబు పొన్దిగా
౧౭ ని కొరవియన్న భీముడు
౧౮ నల్కలకులసన

దక్షిణము

౧ పడినెగెల్చి శ్రీనిరవ
౨ ద్య ణ్డనేకసమరసంఘ
౩ ట్టణభుజాసిభాసుర
౪ న్డై తమయన్న రాజ్యశ్రీ
౫ కెల్ల న్దానయ ఈశున్డై
౬ చేకొనినిల్చి భీమసలు
౭ కియ న్దనేకవస్తువా
౮ హనోత్సవంబు ల్పడయు
౯ చు తమయన్నగాణగయ్య
౧౦ చేసిన ధర్మ్మువులు నసం
౧౧ బును నేగట్టనుగావను
౧౨ రక్షింపను వలయునేని
౧౩ చేకొని కొరవికిచ్చిన
౧౪ స్థితినిల్ప శిలాస్తమ్భం
౧౫ బు ప్రతిష్ఠించి విష్ట
౧౬ రంబును నాతనికొట్టించి
౧౭ న చెఱువులు మఱియు మె
౧౮ వ్వియేసి నాతనిచేయంబడి

పశ్చిమము

౧ వుఱువఱిగినను చెఱి
౨ చినను చుఱియవెఱికిన
౩ ను ముట్టిత్రిగనుఱకాడి
౪ నను ణరవాద్యది ఏను
౫ ంద్రమ్మలు మణిసిచేసిన
౬ దోసంబునకు వానిజీవిత
౭ ంబు దణ్డువు వరియూరబ
౮ ంబు పడువరంబు వెల్లార
౯ బంబు ఎరగద్యాణంబు పే
౧౦ కామణిపున్నమనాణ్డు ఏ
౧౧ నూఱుండ్రమ్మలం వె
౧౨ టి సుఖంబు మనుము
౧౩ నాయకుణ్డై యాకాపులయ్న
౧౪ వేఱరాజులం జొచ్చి మ
౧౫ * * * * స్థితిమణి
౧౬ సికొన్న రాజుల్గలరేని
౧౭ యు యూస్థితిమడిసిన * *
౧౮ నాపకణస్థమన్న కాంపు

---

## 13

### గూడూరుశాసనము

౧ శ్రీవిరియాఅన్వయనీరజాకరదినేశం నిర్మ్మలక్షీర
౨ నాగరసంకాశ విశుద్ధకీర్త్తికనకా(ద్రి)ప్రోన్నతం
౩ వల్లసా ఱురసిష్ట (శిష్టా)ష్టకవిప్రకీర సహకా
౪ రం వైరిగంధేభకేసరి మీూశం విభునూర నున్నతగు
౫ ణోదారం ధరాచక్రదోళు॥ కంద॥ ఆత తనెయుం
౬ వినేయవినూతం భువనప్రసిద్ధకీర్త్తిలతావిఖ్యా
౭ తం సజ్జనవినతాప్రీతం బేతణ నుదారసురభూ
౮ జాతం॥ అవన మనోనయనద్వయభువనజన
౯ స్తుతచరిత్ర సద్గుణగణసంభవజన్మభూమి సజ్జ
౧౦ నయువతీరత్నమ నిబెజ్జమాంబిక నెగడ్దళు॥
౧౧ ఆరమణీనిధానము గంభీరవధూనిధిరఖిళ
౧౨ సద్గుణనిచయం వీరారిదర్పదళనం వీరాగ్రణి
౧౩ యెనసె మల్లనుదగ్రమా (ప) ॥వృత్త॥ ఇదెహేమా
౧౪ ద్రీంద్రమత్యురసన్నతి యమలామేయియిందిజన

౧౫ తా * * వె_త్తింతిలకవ్యంబై మహావిప్రతవితరణసా
౧౬ మార్థ్యర్థిజ్ఞానతానిధి దుగ్ధాంబుధిగంభీరవేతి
౧౭ నయది * * * * * * భాస్వత్సు
౧౮ ధాసుందరవిశదయశం మల్లని ధాత్రిగల్॥ సాశ్వత
౧౯ పుణ్యాలుంపి నఖిలాతిసురామరజాత నున్న తానశ్వరకీ_ర్తి
౨౦ సద్గుణగణావహనం ఘనబాహువిక్రమం విశ్వధ
౨౧ రాతళం పొగడెమోడిసిదం సముదూరదేద్దె మ
౨౨ ల్లేశ్వరమం తటాగఘనవాపిగళం విభుమల్లనూర్జి
౨౩ త॥ వసుధాతళపాళుప నరిసజనసనదళమె
౨౪ * * కటకముం న్నితిశంమాడిసిద శివాల
౨౫ య మనుపమమెళదు దుగుమవారా
౨౬ శధిక పుణ్యాగణ్య॥ ధరెయుం సురాద్రి
౨౭ యుం సాగరముం చంద్రార్కరుం మహేశ్వరరుం
౨౮ దిక్కరిచయము ముట్టిగం సుఖమిరు మల్ల
౨౯ కవీంద్రబ్రింధమంపారియుత ॥శ్లోక॥ శ్రీ శ్రీ
౩౦ స్వదత్తం పరదత్తం వా యో హరేతి వసుంధరా
౩౧ షష్టివర్షసహస్రాణి విష్ఠాయాం జాయతే
౩౨ క్రిమిః॥ వనేవనతరోవహ్ని దహన్మూలం
౩౩ నిరాకృతిం కులంసమూలం దహతి దేవస్వం
౩౪ హ్రితి పాతకః॥ దేవస్వం బ్రాహ్మణస్వం చ యోలో
౩౫ భేచ ప్రభుంజతి స్వపాపా_త్తపరేలోకే గ్రిద్రోచ్ఛిష్టే
౩౬ న జీవతి॥ దేవద్రవ్యం * * * * భక్షంతి యే
౩౭ వరాః నష్టగోత్రాణి నామాని పశ్చాత్పతతిరౌరవం॥ దేవ
౩౮ ద్రవ్యం * * * * బ్రహ్మస్వం * * కులతాం
౩౯ యాంతి బ్రాహ్మణాతిక్రమేణ నమః శివాయః

---

## 14

### ఇనుగుర్తి శాసనము

మొదటివైపు

౧ స్థిరం॥ సాస్థాపయ న్మ
౨ రకతం శివమత్రలింగం
౩ బయ్యాంబికా ఇతివి
౪ శ్రుతవ * * * ం। య
౫ ద్దీధితిప్రతతివిస్ఫుర
౬ మార్జితశ్రీ ర్వ్విర్యార్యాలవ
౭ ంశ కనకకల్పితకల్పఆ
౮ సీత్॥ శ్రీ శ్రీ.

రెండవవైపు

౧ ॥ * * ప్ర త్యేకమే
౨ * త్కక్షీణః। తేషుత్వద్యదివ
౩ * ంర తేషుస్సకలా నాలం *
౪ * సఖా * స్గుణాన్। ధాత్రా
౫ * తు సమ స్తధర్మ్మవస
౬ * (తి) స్త్రే యోభవత్ కల్పితో
౭ * స్తోక * * * పతిషుచా

మూడవవైపు

౧ పన్న గాంజగత్॥ శంభుశ్రీ
౨ పదపంకజప్రణయ
౩ * స్తరోభోజన్స
౪ రూపచరితమ్ *
౫ మైలల * * * విమ
౬ నోహరణం। ఆకస్మి *
౭ సుహిత * * * మసౌ
౮ * * * * *

---

## 15

### బూరుగుగడ్డశాసనము

౧ స్వస్తి సమస్తప్రశస్తి సహితులైన శ్రీ
౨ మహాదేవసగోత్రపురవరాధీశ్వరులై
౩ న నామకూరిఅనభీమానాయనింగారి కొ
౪ డుకు అంనమనాయినింగారు పృధ్వీరాజ్య
౫ ముచేయుచుండంగాను బూరుగడ్డ గ్రామ
౬ మంద పదివేయిగులముంన * * *
౭ * త కాభ్యుదయ శక వరుషంబులు ౧౩౦౦
౮ అగు నేంటి పింగళసంవత్సర జేష్టశుద్ధ ౧౫ గురు

౯ నారమునాండు బూరుగడ్డగ్రామ
౧౦ మందు తమతండ్రి పేరు కొలమునకుం బుణ్య
౧౧ ముగాను రామేశ్వరదేవరను బ్రతిష్ఠసేయిం
౧౨ చి ప్రతిష్టకాలమువుడు భీమనాయనింగారి
౧౩ కిం బుణ్యముగాను * * * * *
౧౪ * * * * * * * * *
౧౫ శ్రీ శ్రీ శ్రీ యిాక్షేత్రము ద్రో
౧౬ యునారు బ్రహ్మహత్యాదిపాతకాములందు బడు
౧౭ వారు శ్రీమహాదేవాయనమః॥

---

# 16

## మధిరశాసనము

### మొదటివైపు

౧ శ్రీమద్ధాత్రీతలేస్మి న్నక
౨ టితనుగుణో దేవరాతా
౩ ఖ్యగోత్రః। పుణ్యః పూర్వ్వం
౪ తెనాలీ పుర మవసథ
౫ ః నారసింహాఖ్యవిప్రః
౬ నాగాంబా తస్యజాయా జ
౭ గదభివిదితా శౌరిణ
౮ శ్రీరివాసీ ద్దంపత్యోని
౯ త్యసత్యవ్రతరతిపరయో
౧౦ బ్రహ్మనామా సుపుత్త్రః॥ ౧॥
౧౧ సర్వ్వానవద్యాభవదస్యభా
౧౨ ర్య్యా కొప్పాంబ్వయా కంజ
౧౩ దలాయతాక్షీ తయోః కు
౧౪ లర్ద్ధే జనితస్సుపుత్రః

### రెండవవైపు

౧ కులప్రదీపో
౨ నరసింహనామా
౩ ॥ శాకాబ్దేదిన
౪ నాథరుద్ర
౫ గణితే ౧౧౧౨
౬ వైశాఖమాసే
౭ సితే రుద్రశ్రీ
౮ ద్విజరాజపుత్ర
౯ దివసే శంభోః ప్ర
౧౦ తిష్ఠాశుభాం
౧౧ కృత్వాభూవిది
౧౨ తంహి శోభనతరం
౧౩ విష్ణోః ప్రతిష్ఠాప
౧౪ నం నానాత్తో * మ

౧౫ ధుళాపురి ద్విజ
౧౬ వరశ్రీనారసిం
౧౭ హాకరోత్ ॥౩॥ సత్యే
౧౮ న వంశానుసరే
౧౯ ణ శాన్తదేవాఖ్య
౨౦ మేకం శివవిప్ర
౨౧ మార్య్యాం। విప్రాయ
౨౨ తస్యార్చ్చన రక్షణా
౨౩ ర్థ్ధాం కులానుభో

మూడవవైపు

౧ గ్యం ధరణీయదీన
౨ తే వృత్తింభూయేచ్ఛన
౩ ఖ్యేయం దీపార్థ్ధాంగి
౪ రిశా ద్వయం ద్రోణద్వ
౫ యం భవి * ద్వ
౬ యం సర్వ్వే * సాక్షికం॥ ౬
౭ దాసోహం పార్వ్వతీనాథ
౮ పరమాత్మ నమోస్తుతే
౯ దాసోహం పుండరీకాక్ష
౧౦ త్రాహిమా స్వరుషోత్తమ॥
౧౧ సద్విప్రధర్మ్మస్య జగద్ధి
౧౨ తస్య ద్రోహాదికం నా
౧౩ శమవిఘ్నమస్తు॥ విపశ్చి
౧౪ నామస్య జనోత్తమానాం
౧౫ సత్యంభవే చ్ఛోభనమే
౧౬ వసత్యం॥ స్వదత్తాం ప.
౧౭ రదత్తాం వా యో హరేతవసు
౧౮ ంధరాం షష్టియర్షగసహ
౧౯ స్రాణి విష్ఠాయాం జా
౨౦ యతే క్రిమిః।

## 17
### లింగగిరిశాసనము

౧ శ్రీశకవర్షము
౨ లు। ౧౧౪౨ అగు నేంటి
౩ ప్రభవసంవత్సర
౪ ఆషాఢ శు ౧ గురు(వా)
౫ రాన సత్రంశ్రీల
౬ కు * * * శ్రీద్రాగిళా
౭ ల ఎంబెరుమానారు
౮ మఠ శేషముగాను
౯ రాజమఠముకాల్వ

## 18
### పానుగల్లుశాసనము
దక్షిణము

౧ * * * * *
౨ శక్షితిపతితిల * * క్షురిసోమరాజా పత్నీతస్యాన్త *

౩ * దబెడగానామ దేవీవినీతాతద్దంపత్యో ్యస్తనూ *
౪ హిమవన్మేనయోరంబికేవ । శ్రీమన్మైలాంబికా * బ
౫ * తేజసాం జన్మభూమి॥ సామత్ప్రిభోన్త్రాంధ్ర
౬ * లక్ష్మీరివ శ్రీ పురుషో త్తమస్య ఖ్యాతి ప్రసూతిర్జన
౭ వంద్య ప్రసాదసంపాదితలోకవృత్తిః॥ వాగ్దేవతేతియామన్య తే
౮ సతి దేవతేతి సాద్విజనైః పరిజనైః కుల దేవతేతియామన్య తే
౯ స్తనతతంవద * సా * త్యసవ్వాఙ్మరత్మితిరుహామదినే తే
౧౦ తి॥ యాసూతాఖిలలోకవీరనజనీ సీమన్తముక్తామణిస్యా
౧౧ * శ్రీమ(ధర్మనత)తయూ వేదానివత్రీన్సుతాఙ్లోకాన్వాను
౧౨ హతస్సమస్తజనతాధారాంజ్వల త్తేజసస్త్రేతాగ్నీనివసేవ్యతాహ
౧౩ పగతాం ధర్మార్థకామానివ వీరప్రాగ్రః ధరాభరభృతే
౧౪ * దేయదారగ్గఙ్శానాత్యప్రతిబింబరూప ఉదయాది
౧౫ (త్య) తుమాధీశ్వరం భీమోభీమపరాక్రమోజితరుతి *
౧౬ కీర్తిఙ్క్రియాకన్నఙ్భూజనమాననీయచరితంగోకన్నఙ్భూపాల
౧౭ కం॥ తేషాంభీమో భీమవత్పాండవానాదిత్సుఖ్యాతో భూరిదో
౧౮ ర్వ్విక్రమేణయత్కీర్త్తిఙం * * న్నదూపేసదాసన్సర్వ్వఙసిధ్యం *
౧౯ మానీస్వరూపాః॥ సాత్రియసీతనూజస్య తస్యమహీ (ప)
౨౦ తేః॥ తర్కాఙబ్దిదిజ్ఞ్మతేకాలేశకస్య క్రోధివత్సరే సూయ్యఙగ్ర
౨౧ హే చోడభీమనారాయణపురాహ్వయం । అష్టోత్తరశతో
౨౨ ప్రాదాదగ్రహారంద్విజన్మనాం॥ సాష్టభోగజనైర్వ్వఙంద్యమాచం
౨౩ ద్రరవితారకం॥ తత్రైవవత్సరేచోడభీమైనారాయణాహ్వయః॥

తూర్పు

౧ * నుప్పునిబరవ । జొన్నలబండికి ప ౨౪ గి
౨ ఉకకు వి ౨ కు ౧ వ * డుంనీరబరవఆకుబెజ్వర
౩ కకురు ౨౪ ఆకుంగట్టు । (మోపునకు వ ౨।
౪ (ల) కుంగట్టు ౯ పోంకబండికా ఉ ౮ పోంకలు । ౨౦
౫ * ఉకకు వ ౪ పోక * ౦ ౦ మిరియాలబండి ౨౨
౬ రరుగిద్భగ్గాప ఆ * కసనాక ౨ అల్లము * వ

౭ తుపలి॥ విస్యలు॥ ౨ పెఱుకకు రు ౧ విస్య ()
౮ పసపుబ్రత్తిసింబెల్లముంనీబరమచీరలు
౯ ద్యనీరకురు ౨॥ లోకావలకుంగమపుల
౧౦ రుణసపర్యలకు నిబరమనకరములో
౧౧ పలచుదెముదెచ్చి యవ్వారుదాంవినాసు రార
౧౨ డ్డియరువంగలవారలంగడసిద్ధాయము
౧౩ ఇందెగు। దేవరకుంగానికిఇంజ ప ౨
౧౪ నామిసెట్టిచెఱ్వు దేవరకర్ధ్ధమును మహాజన
౧౫ మునకర్ధ్ధమును పానుగంటదళవృత్తి పుడవల్లు। ౪౦
౧౬ సూత్రధారి బ్రహ్మోజుబెరసినసూత్రధారులపూర్వ్వవృ
౧౭ త్తి కాస్యపల్లిని బానుగంటదళవృత్తిపుడపల్లు ౨౦ భీమ (స)
౧౮ ముద్రము వెనుక పుడమఱుతురు * చోడసముద్ర
౧౯ ము వెనుక పుడమఱుతురు ౪

ఉత్తరము

౧ డులునారాయను * *
౨ యుడుభాస్కరభట్టు సోమేశ్వరభట్టోపధ్యాయ
౩ లకు వృత్తులు ౨ అప్పనభట్లకు వెలిపొలమువృత్తులు ౨
౪ దేవరభాగములోన దేవరఅంగభోగానకుగాల్పుడ్లు ౧౦ కా
౫ లఱుతురు (పూజర్లకునాల్పుడ్లు ౧ కాలఱుతురులు
౬ * * యనిల్పిన దేవరభాగము గీతవాద్యనృత్యదూ
౭ రడశంకుధారలులోనైన కేలనము నేసి బాయపా *
౮ వారోజునువృత్తికాఱకుడువంగలవారు ఈ రెండు *
౯ తలరాసినకుంలువోడిబినముప్పెకుగాల్పుట్టి *
౧౦ (సా)మాన్యోయంధర్మ్మసేతున్నృపాణాం కాలే కాలే పాలనీయో
౧౧ (భ)వద్భిః॥ సర్వ్వానేతా న్భావినః పార్త్థివేంద్రా న్భూయో భూయో
౧౨ (యాచ) తేరామచంద్రః॥ సద్వంశజాః పరమహీపతివంశ
౧౩ జావా పాపాద పేతమనసోభువిభావిభూపాః। యేపాల
౧౪ యన్తిమమధర్మ్మ మిమం సమస్తం తేభ్యోమయూవిర

౧౫ (ద్బి)తాంజలి గేషమూర్ధ్నిః॥ షష్టివర్షసహస్రాణి స్వర్గే తి
౧౬ (ష్ఠ)తిభూమిద అపహర్తానుమన్తాచతాన్యేవనరకంవ
౧౭ (సే)త్॥ విన్ధ్యాటవిష్వతోయాసుశుష్కకోటరవాసినః॥ కృ
౧౮ * * హాజాయన్తే బ్రహ్మదేయాపహారిణః॥ * *

---

# 19

## నగునూరు శాసనము

౧ సర్వజితుసంవత్సర పాల్గుణసుద్ద ద
౨ శమి గురువారమున చపాండుప
3 ట్టిన । ఆనడుమాను మదీయస్థల
౪ దేవన ధర్మసాలియ జనులు
౫ యందఆపంపునా మనిజెల్లంగా
౬ ఆమల్లిసెట్టిని ఆయనకొడుకు
౭ వెన్నిసెట్టిని హరేశ్వరదేవర బ్రతి
౮ ష్టను గణపదేవమహారాజు
౯ పేర గణపరేశ్వరమును సక
౧౦ లభక్తులపేరను సకలేశ్వరము
౧౧ ను ప్రతిష్ట చిల్లరిదేవరకు అం
౧౨ గరంగవిభోగాలకు ఇచ్చిన
౧3 ఆయవ్రిత్తులు తమ ఆమేడి
౧౪ చరలదగెడి నానవీసము ఇ
౧౫ స్తిమి ఆచంద్రార్కార్కాది నిలిచె
౧౬ డిని ఈనివాడుగంగకఋత
౧౭ కవిలపొడిచినవాడు వీడు
౧౮ సమయానకు నువెలిసివా
౧౯ ద్రోహుండు వానిమట్టుకు
౨౦ దేవడు నింతసడ్డవీడు
౨౧ వాండు సివద్రోహ

---

# 20

## అలంపురము శాసనము

౧ శ్రీజయత్యావిష్కృతంవిష్ణో ర్వారాహం క్షోభితార్ణవం దక్షిణోన్నతదంష్ట్రాగ్ర
విశ్రాన్తభువనం వపుః । శ్రీమతాం సకలభువన సంస్తూయమానమానవ్య * *
౨ మాతృభిరభివర్ధితానాం కార్తికేయపరిరక్షణప్రాప్తకల్యాణపరంపరాణాం కార్తి
కేయప్రసాదసమాసాదిత వరాహ * * *
3 చళుక్యానాం కుల * * * * రశ్వమేధావభృథస్నానపవిత్రీకృతగాత్రస్య శ్రీపుల
కేశివల్లభమహారాజస్య ప్రియతనయ * * *

౪ ద్వీజ * * * య శ్రీప్రిధ్వీవల్లభమహారాజాధిరాజపరమేశ్వరస్య ప్రియతనయః విక్ర
మాదిత్యభట్టారక _స్తస్యా(ను)జః వినయాదిత్య సత్యాశ్రయశ్రీ * * * * పి
వల్లభమహారాజస్య * * *

౫ ధిరాజపరమేశ్వరభట్టారకస్య ప్రియసూను స్సమ_స్తపార- * * సానతపవిమ్మాస్య
విజయాదిత్యసత్యాశ్రయశ్రీపృధ్వీవల్లభమహారాజాధిరాజపర

౬ శ్యాజ్ఞయా ·వగోవర్ధశాతావార్యస్వామినః। (షడ్వింశదు_త్తరషట్ఛతతికే) నిజ
ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరే వ్వష్టాదశేవర్తమానే వైశాఖశుక్ల
త్రయోదశ్యా మ

౭ శత_స్తితమ స్వ_స్తిగోబ్రాహ్మణస్య వపుఃప్రజానాం (చ) శుభంభవతు ◎ * ద్యప్రకార
మానశాతావార్యస్వామినే ధారాద_త్తం॥ ◎ శ్రీ

---

# 21

## వే ము ల వా డ శా స న ము

### ప డ మ ర

౧ శ్రీమాన్నాభిసుస్త్రమోహంతాద్దైత్యదర్పాపహారః పరం
౨ లోకైకలోచనః పాయాదపాయాద్భువనత్రయం॥ (౧)
౩ స్వ_స్తి సమ_స్తవిబుధజన సంస్తూయమాన స్సక
౪ లకలాకమలైకరాజహంసః। కంసమథనఇవ
౫ కమలాకరీకృతవక్షస్థలః। స్థాణురివభ_స్మ
౬ సాత్కృతసమస్తారిపురః ప్రచణ్డప్రవృక్పాలయదయా ప్రబోధితా
౭ శేషప్రవాహాంభోజాన్వర్థీకృతవినయాదిత్య
౮ నామధేయః ప్రసాధితాశేషదిఙ్మణ్డలశ్చ పర
౯ మణ్డలైకరామశ్చాలుక్యకులతిలకః శ్రీయుద్ధ
౧౦ మల్లోనామరాజాబభూవ॥ సోయం కిలా శాసద
౧౧ నన్యశాస్య సపాదలక్షం క్షితిమక్షతాజ్ఞః। స
౧౨ మ_స్తరాజేన్ద్రికిరీటకోటిమాణిక్యరశ్మిః ప్రక
౧౩ రాచ్చిర్ణతాంఘ్రిః॥ (౨) యఃపాదని స్సీధుమయీగజానాం వి
౧౪ ధాయ వాపీమ పితైలపూరై స్సుసర్వలోకం స

౧౫ తతంవి తేనచాస్త్రి కుచానామరిసున్దరీణాం॥ (౯)
౧౬ నచిత్రకూటం బహుచిత్రకూటం శక్యాసు రేన్ద్రైరపి
౧౭ నోపయాతుం త్రివర్గయుక్తః ప్రణతారివర్గః
౧౮ స్వభావదుర్గ్గం కిలతంజహార॥ (౪) తస్యాత్మజో ద
౧౯ క్షిణబాహుదణ్డచణ్డాసిధారాహతవైరి
౨౦ షణ్డః। బలాద్గృహీతాఖిలవేఙ్గీదేశః సా
౨౧ తిష్ఠ పృథ్వీమరికేసరీశః॥ (౫) భూయోస్మిన్న
౨౨ రసింహధర్మ్మనృపతిర్భూమిం సతాంపాలయ
౨౩ న్రాజాదిత్యఇతిశుమూపతిరతః శ్రీయుద్ధమ
౨౪ ల్లోనృపః॥ (౬) త్యక్తాయేనదరీవివర్ణవిభవాఢ్యా క్షితి
౨౫ భూభుజఃప [* * * * న్వదేశరత్విదా] శరపరశ్రీయుద్ధ
౨౬ మల్లేశ్వరః॥ (౭) తతస్సరాజన్యశిరోమణీనామ్నాపదార
౨౭ విన్దేనహృదోహరద్యః। బభూవనామ్నా నరసింహదేవో
౨౮ ధాత్ర్యామభూద్భూరిధృతాధిపత్యః॥ (౮) యస్య ప్తదుస్సాధతరం నృ

దక్షిణము

౧ పాణాన్నిర్జ్జిత్యసద్యస్సమరాంగ
౨ ణేషు విన్యస్యకేహ స్తమతోనుతానాం
౩ తాల్మాలవన్యాఃకరటీచకార॥ (౯) ప్రత్యుద్గతాం
౪ గూర్జ్జరరాజసేనాంనిర్జిత్యరాజాస్వయమేక
౫ వీరః। కాలప్రియేరాజకదంబకస్యస్తుభాస్వపి
౬ య్యర్వలిలేఖశైలః॥ (౧౦) తస్యోదపాదిబలవ
౭ త్పరచక్రకుంభికుంభస్థలోద్దలనదక్షక్రూ
౮ పాణపాణిః। భీతానతారిసరపాలకిరీటకోటి
౯ సంఘట్టితాంఘ్రిసరసీజవిరాజితా
౧౦ ననః॥ (౧౧) శ్రీమాన్మహీపతిస్సాత్త్వాన్నామ్నా వీరో
౧౧ ఒరికేసరీప్రాదుర్బభూవ। తేజస్వీప్రాత
౧౨ ర్భానురివోదయాం॥ (౧౨) సమస్తసామన్తశిఖా
౧౩ మణీనాంప్రభాప్రపాతాయితశాఖ్వరాంస్వ

౧౪ సంచారనారీనయనాంబుజానాం లక్ష్మీహి
౧౫ మాసారఇవాహరద్యః ॥ (౧౩) సామన్తాన్దణ్డ
౧౬ ఖ్యాన్నిజభుజపరిఘాః ప్రస్ఫురత్ఖడ్గధారాః
౧౭ నీరాంభోరాసిమగ్నాంస్తురగకరిఘటాపత్తిసం
౧౮ పత్తియుక్తాః కృత్వాపద్దాయ్యమాయ్యః స్వజనపరి
౧౯ జనైస్సనిహాంత్యాజరంగే కృద్ధేగోవిందరాజ్యాహరణ
౨౦ ముపగతోరక్షితోయేనబిజ్జః ॥ (౧౪) దేవీంరేవకునిర్మ్మ
౨౧ డిప్రతిహాతేరిన్ద్రస్యపుత్రీన్సుతాపౌలోమీంమి(ఇ)వ
౨౨ వాసవప్రియమి(ఇ)వశ్రీమన్మురధ్వంసకః । శ్రీరత్నం
౨౩ పరిణీయయేననితరాం తస్యాస్సపత్నీకృతా సా
౨౪ నాంసప్తసముద్రముద్రితు(త)మహీమ్నానోన్న తేనాధు
౨౫ నా ॥ (౧౫) తేనభీతానతాఖిలబలవదిలాపాలమా
౨౬ ళిమాణిక్యరశ్మిమాలాలాలితచరణకమ
౨౭ లయుగళేన శరణాయాతక్షితిపాలప్రాణి-

తూ ర్పు

౧ రక్షణదక్షవీరశ్రీయూకోపలతీక్షణదక్షిణ
౨ భుజాగ్గళేణ కాన్తాకాన్తకాన్తాజనమనోభవ
౩ వల్లభేన కరిణాపుత్రాహావస్సకలగజ వి
౪ కీర్త్యారేవటేనగీతమేవైకన్తి తరళా వ
౫ దధిరుద్రటేన రాజాత్మజేనేవపరిరక్ష
౬ విధానదక్షిణ బాహుబలేనచ బంధురక్షణేన
౭ సన్నృపః । బన్ధుపరాయణేన ఈశ్వరేణచ
౮ విజితమనో భవేనోమా మాప్రియేణచ
౯ నారాయణేన చ గోవర్ధనాగధరేణ చ
౧౦ చతురాననేనచ చతురాననేనచ వాసుకు
౧౧ లకళానిలయేన తారహారాది రమ్య
౧౨ మూలగన్ధకరేణ కాన్తిమతావనజేన
౧౩ బన్ధనేవప్రబోధితబన్నరబన్నవ

౧౪ దనవనజేన నిరస్తారతితిమిరేణ
౧౫ చ సహస్రకిరణవదతుల తేజసా
౧౬ శ్రీమదరికేసరిమహారాజేన ॥
౧౭ స్వస్తిసమధిగతపఞ్చమహాశబ్దమహా
౧౮ సామన్తాధిపతిసమస్తభువనసంస్తూయమా
౧౯ నచాళుక్యవంశోద్భవం పాంబరాంకుశవర్మ్మణగ
౨౦ న్ధవారణం గన్ధేభవిద్యాధర నారూఢసర్వజ్ఞ
౨౧ మహాత్తనారాయణం (మత్తిగల్లాం) గుణం అరిగుణ్డా
౨౨ ర్ణవం శరణాగతవజ్రపంజరం ప్రియళ్దం
౨౩ త్రిభువనమల్లసామన్తచూడామణి శ్రీ
౨౪ మదరికేసరియరసరి తత్పాదపద్మో
౨౫ పజీవి సమస్తరాజ్యభారనిరూపిత మహా
౨౬ సన్ధివిగ్రహపదవీప్రతిష్ఠితం సమస్త
౨౭ శాస్త్రపారగం శ్రీమత్సన్ధివిగ్రహగుణక (శ
౨౮ ర్మ్మణా)॥ తదాంభో * * * యీా * * * న *
౨౯ త * * వి * * * * * * * *

ఉత్తరము

౧ శ్రీమాన్ బద్దిగభూమిభర్త్తుస్స
౨ త్రాధిపాలో ఽజనినాగమార్య్యః। గుణార్ణ
౩ వోర్వీపతిం తంత్రపాలస్తస్యాత్మజో ఽజాయ
౪ తే పెద్దణార్య్యః॥ తేనాభ్యర్థితో దేవతాంవన్ద
౫ ననిమిత్తమాగంత స్వనిర్మాపితాదిత్యగృహ
౬ మాగతాభ్యాగతా జనసత్రనిమిత్తముత్తరా
౭ యణపుణ్యసంక్రాన్తిదివసే శతనివర్త్తనసం
౮ ఖ్యాతభూమిక్షేత్రమష్టనివర్త్తనసంఖ్యాతం
౯ పానీయ భూమిక్షేత్రంచ అ * ల పాల
౧౦ కపత్తణే * * * * శ్రీమదరికేసరిక్షితి
౧౧ పతిరదాత్॥ తత్ర రాజేశ్వరాదిత్యగృహ బద్దె

౧౨ గీశ్వర నగరీశ్వర ప్రభృతిచవాస్థానాది (వ
౧౩ సుస్సాక్షీనుల్లికార్జున ము_క్తిలింగి విద్యాధరాది
౧౪ దివ్యాఖ్యభట్టారకాశ్చసాక్షిణః॥ చన్ద్రిశ్రేష్ఠిప్రభృ
౧౫ తయేనచశ్రేష్ఠినశ్చసాక్షిణః॥
౧౬ నిస్పృహైకాగ్రణీస్సూరిస్థానాధిష్ఠోయశాస్వయం
౧౭ దాతావియాన్వయెజాతః పణ్డితమునీశ్వరః॥
౧౮ స్వధర్మ్మార్ణవధయంధర్మ్మః పాలనీయోనరాధిపైః
౧౯ స్వధర్మ్మార్ణయస్థితేస్సంతః ప్రత్యూదంతకదాచన॥ (౧౬)
౨౦ కాలక్షేపోనక_ర్త్తవ్యం ఆయుక్షీణేదినేదినే।
౨౧ సమ_స్తకరుణన్యా_స్తిధ_ర్మశ్చత్వారితాగతే॥ (౧౭)
౨౨ అనిత్యానిశరీరాణివిభవోనై వశాశ్వితః।
౨౩ నిత్యంసన్నిహితోమృత్యుర్కర_ర్త్తవ్యోధర్మ్మసంగ్రహః॥ (౧౮)
౨౪ అన్యక్షేత్రస్యద్వాదశధర్మ్మసిద్ధాయ॥

---

## 22

### దోసపాటి శాసనము

౧ స్వస్తి శ్రీశకవర్షములు
౨ ౧౧౧౨ అగు ఆనందసం
౩ వత్సర మార్గ్గశిర బ॥ ౧౩ బు
౪ దోసపాటి రుద్రయ హారిహా
౫ రదేవనికి తమతండ్రి గుండ్ర
౬ డ్డికిం నమతల్లి కామసా
౭ నికిం బుణ్యముగా శ్రీతోం
౮ ఉేశ్వర దేవర నగరికి ఆయూ
౯ రిదక్షిణపు వలని తనతోం
౧౦ టన రాట్నముకలప ఆడిప్ప
౧౧ డ్ల ౨ సహితముగా నిచ్చె॥

---

## 23

### నాగులపాటి శాసనము

౧ స్వస్తి శ్రీశకవరుషంబులు ౧౪౦౪ అగు
౨ సుభకృతు ఫాల్గుణ బ ౧౦ బు రామరాజుమే
౩ డ్రాజుంగారు పృథ్వీరాజ్యముసేయంగాను వు

౪ ఛ్చేవలి అక్కి-రాజు పోతరాజుంగారికొడు
౫ కు కాంచనంగారనుజుండు అక్క-నకామేశ్వ
౬ రలింగానకు పానవట్టమునేఇంచెను శ్రీ॥

---

## 24

### ముదిమాణిక్యము శాసనము

#### మొదటివైపు

౧ స్వస్తి శ్రీజయదేశాశ్చ
౨ వసుబాణార్క ౧౨౫౮ సం
౩ యుతే। ధాతాబ్దే శ్రావ
౪ ణేశుక్లపుష్య మ్యర్క-స్య
౫ వాసరే॥ భోభుజ్యమాన
౬ శ్రీరాజ్యం శ్వేతగ్రామం
౭ మహాయశః॥ ఎల్లులెం
౮ కేతివిఖ్యాతః ప్రజాపాల
౯ నతత్పరః॥ మద్దప్పకు
౧౦ లజాతాద్యా ఎట్టి
౧౧ పోతాఖ్యనాయకా
౧౨ త్। మల్లాంబా లభతఃసూ
౧౩ నుం మల్లిసెట్టీతినామ
౧౪ కం। తస్యాగ్రజాతస్తన
౧౫ యో। వాసులంకేతికీర్తితః
౧౬ తస్యనామ్నా తడాకం
౧౭ శ్రీవాసాబ్ధిరితికీర్తి-దం
౧౮ వృద్ధపూర్వక రత్నాఖ్య
౧౯ గ్రామాత్ పశ్చిమతోది
౨౦ శి

#### రెండవవైపు

౧ పుత్రప్రేమ్ణాత
౨ డాగం తం మల్లి
౩ సెట్టి రనుజ్యత॥ మల్లాం
౪ బా మహనియ్యరా
౫ జదుదర క్షీరాంబు
౬ రాశేరసా। జాతో భూ
౭ సురభూరిదానచతు
౮ రః శ్రీమల్లిసెట్టి * *
౯ రత్న్యం త్వేన మహాగ
౧౦ వం సురగణబ్రహ్మ
౧౧ దయోమాతరం సూ
౧౨ ర్యా-దిగ్రహమండల
౧౩ శ్చ సహజే స్త్రీపుత్రపాత్రా
౧౪ న్వితం॥ ఈశ్వరా
౧౫ య్య-సుపుత్రేణ మా
౧౬ ధవాఖ్యేన సూరి
౧౭ ణా ధర్మార్థ
౧౮ సిధ్యర్థం ప్రోలకం స్యా
౧౯ సన ముత్తమం।
౨౦ श्रीरामचंद्रायनमः

---

# శాసన వివరములు



సూచిక.

1. స్థలము.
2. రాజు.
3. కాలము.
4. భాష.
5. సారాంశము.

# శాసనవివరములు

## కాకతీయశాసనములు

### 1

౧ ఖాజీపేట: (వరంగల్ జిల్లా)
హనుమకొండ ఖాజీపేట మధ్యత్రోవలో పోలీసు నాకావద్దనున్నది.

౨ ప్రోలరాజు

౩ *

౪ కన్నడము

౫ అడుగుభాగము విరిగిపోయినది. 5, 6, 7 పంక్తులకు కలిసివచ్చునట్లు రోలు కొట్టబడినది. దుర్జయకులాబ్ధిచంద్రుడగు బేతరాజును అతని పుత్రుడగు ప్రోలరాజునుం బేర్కొనుచున్నది.

### 2

౧ ఖాజీపేట: (వరంగల్ జిల్లా)

౨ ప్రోలరాజు

౩ *

౪ కన్నడము

౫ మొదటిశాసనశిలమీదనే నిదియున్నది.
మహామండలేశ్వర కాకతీయ బేతేశుడు తన తండ్రి పోళలరసునకు పుణ్యముగా చేసిన వరుణప్రతిష్ఠాపనమును దెలుపును. దీనిని మొదటిశాసనముతో కలిపి చదివినయెడల కాకతీయులలో బేతరాజు తండ్రి పేరు ప్రోలరాజనియు, బేతరాజుకొడుకు పేరు ప్రోలరాజనియు తేలును. ౧, ౨ శాసనములనుండి కాకతీయవంశమునందలి మూడు పురుషాంతరములు తెలియనగుచున్నవి.

### 3

౧ ఇనుగుర్తి: (వరంగల్ జిల్లా)
గుంటచెఱువుప్రక్కనున్న కొండమీది గుహలోని భైరవవిగ్రహముచెంత.

౨ ప్రోలరాజు

౩ *

౪ తెలుగు

౫ రాయి మిక్కిలి గగ్గులుగానున్నది.
ఇనుగుర్తిలోని కొండమీద ప్రోలరాజు జలంధర భైరవ దేవప్రతిష్ఠను చేయించినట్లు తెలుపుచున్నది.

### 4

౧ మాటూరు: (వరంగల్లుజిల్లా)

౨ ప్రోలరాజు

౩ శా. శ. ౧౦౪౩

౪ తెలుగు

౫ మహామండలేశ్వర కాకతీయప్రోలరాజు సామంతుడగు మల్లెనాయకుని ధర్మమును తెలుపును. ఈ శాసనము రెండవప్రోలుని కాలమును నిర్ణయించుట కుపకరించును.

### 5

౧ హనుమకొండ: (వరంగల్లుజిల్లా)
వేయిస్తంభముల మండపముగల రుద్రేశ్వరాలయములో నున్నది.

౨ రుద్రదేవుడు

౩ శా. శ. ౧౦౮౪

౪ సంస్కృతాంధ్రములు

౫ కొంతభాగము పాడుచేయబడినది.
డాక్టరు ఫ్లీటుదొరవారు ఇండియన్ ఆంటిక్వేరి సంపుటము ౧౧, పుట ౧౦ లో ప్రకటించిన సుప్రసిద్ధశాసన మిదియే. పూర్వకాకతీయుల వంశానుక్రమణిక, వారి విజయములు, ప్రత్యర్థుల చరిత్రలు, వారల రాజ్యవిశేషములను విశదీకరించును. ఇందలి కవితాశైలి మనోహరముగ

నున్నది. ఈశాసనము కాకతీయ చరిత్రమునకు మూలస్తంభము.

## 6

౧ కరీంనగరము :
కలెక్టరు బంగళాలో పాతబడినది.
౨ రుద్రదేవుఁడు
౩ శా. శ. ౧౦౯౨
౪ తెలుఁగుపద్యములు
౫ శాసనము ౧౬ పుటలో చుక్కలు పెట్టినచోట బెత్తికలు లేచిపోయినవి. నగునూరునుండి తేఁబడినదఁట.
ప్రోలరాజుకాలములో రాచనగరు ఉద్యోగులలో నొక్కఁడును, రుద్రదేవుని మంత్రియు నగుగంగాధరుని ధర్మము లనేకములను చేర్కొనును. ఆకాలములో బౌద్ధజైనమతములు ప్రచారములో నున్నట్లును, హనుమకొండయొక్కయు, ఆప్రాంతములయొక్కయు స్థలవిశేషములను వివరించును. నెం. ౫ ౮. అనుమకొండశాసనములోని రుద్రేశ్వరాలయమును, మన్త్రికూటనగరము నిందు పేర్కొనబడినవి. ఇందలి హిడింబతీర్థము ప్రతాపచరిత్రాదులందుఁగూడ గాంచనగుచున్నది.

## 7

౧ పిల్లలమఱ్ఱి : (నల్లగొండజిల్లా)
సోమేశ్వర ముక్కంటేశ్వర దేవరగుళ్ళమధ్యనున్న నిలువుస్తంభముపై నున్నది.
౨ రుద్రదేవుఁడు
౩ శా. శ ౧౧౧౪
౪ సంస్కృతము-తెలుఁగు
౫ కామయ కాచాంబికల కొమరుఁడు రేచెఱువుల నామిరెడ్డి తనపేరను, తన తలిదండ్రులపేరను ప్రతిష్ఠించిన దేవరలకు ధర్మములను దెలుపును. ధర్మము చేసిన కాలమున పరిపాలించుచున్న రుద్రదేవునకు తాను సామంతుఁడయినట్లు చెప్పుకొనినాఁడు. ఈ రాజుయొక్క అంత్యసంవత్సరమిదియే యై యుండనోపు. అందువలన ఏ శాసనము గూడ కాకతీయుల కాలనిర్ణయమున కత్యంతోపయోగకరము. ఈ గ్రామమునందలి శాసనములనుండి రెడ్డికులమునకు జెంది యింతవరకును చరిత్రకు దెలియని యొక రేచెర్ల వంశము తెలియనగుచున్నది.

## 8

౧ కొండిపర్తి : (వరంగల్లుజిల్లా)
విష్ణ్వాలయముచెంత.
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ ౧౧౧౩
౪ సంస్కృతము
౫ మల్యాలవంశీయుఁడగుచాండసేనానిధర్మమును దెలుపును. ఈతఁడు గణపతిదేవుని దండనాయకుఁడు. ఇందీతని వంశవృక్షము కలదు. దీనికి నెం ౮, ౧౪, ౨౧, ౩౬ శాసనములతో చేర్చి చదివినచో మల్యాలవంశచరిత్రము సమగ్రముగ దెలియనగును.

## 9

౧ పిల్లలమఱ్ఱి : (నల్లగొండజిల్లా)
నామేశ్వర ముక్కంటేశ్వరదేవాలయములో
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ ౧౧౨౪
౪ సంస్కృతాంధ్రములు
౫ కాకతీయ ౭ వ శాసనము శిలమీదనే యున్నది. పిల్లలమఱ్ఱిలోని దేవరలకు నామిరెడ్డి చేసిన ధర్మములను దెలుపును. ఇందాతని బిరుదావళులుగలవు. రేచెర్ల వంశవృక్ష మిందు గలదు. ఈ శాసనము రేచెర్ల వంశమునకు బమ్మసేనాని మూలపురుషుఁడనియు నాతడు కాంచీపాలకుఁడగు చోడరాజును జయించెననియు చెల్పుచున్నది. నెం ౧, ౨, ౮ శాసనములను, హైదరాబాదు గవర్నమెంటువారిచే ప్రచురింపబడిన పాలంపేటశాసనమును ప్రకృతశాసనముతో సమన్వ

యించినచో కాకతీయ వంశమునకు మూలపురుషుఁడగు మొదటి ప్రోలరాజుకాలముననే రేచెర్లవంశము ప్రసిద్ధి జెందినటుల దెలియనగును.

## 10

౧ నాగులపాడు: (నల్లగొండజిల్లా)
ఉసిర్లమొత్తయను పేరుగల పొలములో నున్నది.
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ ౧౧౨౪
౪ తెలుఁగు
౫ నామిరెడ్డి ధర్మమును దెలుపును. ఇందు రెడ్డి అనుటకు బదులు రడ్డి యని వాడఁబడినది.

## 11

౧ పిల్లలమఱ్ఱి: (నల్లగొండజిల్లా)
సోమేశ్వరాలయమువద్ద స్తంభమమీద.
౨ గణపతిదేవుఁడు.
౩ శా. శ ౧౧౩౦
౪ సంస్కృతాంధ్రములు
౫ ఇందలి ఇతివృత్తము కాకతీయ ౭, ౯ శాసనములతో సరిపెట్టుకొనవలయును. రేచెర్ల బేతిరెడ్డి పత్నియగు ఎఱకసానమ్మ ధర్మమును దెలుపును. ఇందీమె తండ్రి వంశానుక్రమ మీయఁబడినది. పిల్లలమఱ్ఱి గ్రామమున ఎఱకేశ్వరాలయమునకు చేరి ఎఱకమఠ ముండెడిదనియు నందు విద్యార్థులు చదువుకొనుచుండెడివా రనియు నీ శాసనమునుండి తెలియుచున్నది. చక్కని లిపి

## 12

౧ అన్నవరము: (నల్లగొండజిల్లా)
దేవతల చెర్వు (నాగులసముద్రం) గండిమీద
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ ౧౧౩౦
౪ తెలుఁగు
౫ అయితాంబికకుమారుఁడగు రేచెర్ల కామిరెడ్డి చేసిన ధర్మమును దెలుపును. ఇందు కాకతీయసామంతులగు నీవంశమువారి బిరుదావళులు వర్ణింపఁబడినవి.

## 13

౧ వాడపల్లి: (నల్లగొండజిల్లా)
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ ౧౧౩౩
౪ తెలుఁగు
౫ కొమరెనాయక, బేతెనాయక, రుద్రనాయకులు తమ్మేలిన గణపతిదేవ మహారాజుపేర, తమ తండ్రి కాటనాయకునిపేర చేసిన ధర్మమును దెలుపును.

## 14

౧ సోమవరము: (నల్లగొండజిల్లా)
మూసీనదియొడ్డున జీర్ణాలయములో.
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ ౧౧౩౫
౪ తెలుఁగుభాష
౫ కాకతీయ ౧౪, ౧౫, ౨౫, ౨౬ శాసనములు ఒక్కరాతి స్తంభముపైననే మూడువైపుల చెక్కఁబడినవి. రేచెర్వుల బేతిరెడ్డికి పుణ్యముగా నిచ్చిన ధర్మములను దెలుఁపును. ఈధర్మము బేతిరెడ్డి మరణించిన పిమ్మటనే చేయఁబడి యుండును. కానిచో నాతని యనుజుడగు నామిరెడ్డి రేచెర్లవంశమున కధిపతియై బిరుదములను ధరించుట పొసగనేరదు. (చూ. నెం. ౯ వ శాసనము)

## 15

౧ సోమవరము: (నల్లగొండజిల్లా)
మూసీనదియొడ్డున, జీర్ణాలయములో.
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ ౧౧౫౬
౪ తెలుఁగుభాష
౫ కాకతీయ ౧౪, ౧౫, ౨౫, ౨౬ శాసనములు ఒక్కరాతి స్తంభముపైననే మూడువైపుల చెక్కఁబడినవి.

రేచెర్ల నామిరడ్డి తన తలిదండ్రులకును, తనకును ఆయురారోగ్యములకొఱకు ఇచ్చిన ధర్మమును దెలుపును.

## 16

౧ నాగులపాడు : (నల్లగొండజిల్లా)
శివాలయములో
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ ౧౧౫౬
౪ తెలుఁగుభాష
౫ మండలిక రేచెర్ల కాట్రెడ్డి తన తండ్రి నామిరడ్డికి, తనతల్లి అయ్తమాంబకు, తనకు పుణ్యముగా, నామేశ్వర, అయ్తేశ్వర, కాటేశ్వర దేవరలను ప్రతిష్ఠచేసి గణపతిదేవమహారాజు పృథ్వీరాజ్యము చేయుచుండగా నిచ్చిన ధర్మమును దెలుపును.

## 17

౧ కొండిపర్తి : (వరంగల్లుజిల్లా)
కోటలోని జీర్ణాలయము నెదుట.
౨ గణపతిదేవుఁడు.
౩ శా. శ. ౧౧౬౨
౪ సంస్కృతము
౫ చక్కని లిపి. అన్నివైపుల పగులఁగొట్టబడినది. అందుచే విషయము అసమగ్రము.
మల్యాలవంశీయుఁడగు కాటచమూపతి ప్రోలేశ్వర, అచ్యుతేశ్వర, రుద్రేశ్వరదేవరల ప్రతిష్ఠలను చేసి నట్లు తెలుపును. ఆతని వంశవృక్ష మీశాసనమం దీయఁబడినది. ఇతని ప్రత్యర్థిగ సంకిసాధీశ్వరుఁ డిందు పేర్కొనఁబడినాఁడు. ఈతనిగూర్చి విశేషములు తెలియుటలేదు.

## 18

౧ గణపవరము : (నల్లగొండజిల్లా)
జీర్ణశివాలయమువద్ద.
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ. ౧౧౪౫
౪ సంస్కృతభాష
౫ పైభాగము పోయియున్నది.
జగద్దేవుని పేర్కొనును. ఈతని కొడుకు దేవభూపాలుఁడు. జగద్దేవుని తరువాత కాకతి ప్రోలుఁడు రాజ్య మేలినాఁడని తెలుపుచున్నది. గణపతిని, ఆతని తండ్రి మహాదేవుని, పినతండ్రి రుద్రునికూడఁ బేర్కొనుచున్నది. నెం. ౫ రు హనుమకొండ శాసనమున ప్రోలుని ప్రత్యర్థిగ బేర్కొనబడిన జగద్దేవుఁ డిందలి జగద్దేవుడేయని చెప్పవచ్చును. అప్పు డా రెండు శాసనములను సమన్వయింపవలసి యుండును.

## 19

౧ నాగులపాడు : (నల్లగొండజిల్లా)
దేవాలయములో.
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ. ౧౧౭౦
౪ తెలుఁగు
౫ అయితాంబికతనయుఁడైన రేచెర్ల కామిరెడ్డి ధర్మమును దెలుపును. (చూఁడుము కాకతీయ ౧౨).

## 20

౧ బూదపూరు : (మహబూబునగరుజిల్లా)
మసీదులో.
౨ గణపతిదేవుఁడు
౩ శా. శ. ౧౧౭౧
౪ సంస్కృతాంధ్రములు
౫ గణపతిదేవుని సేనానాయకుఁడగు మల్యాలగుండయ చేసిన రెండు దేవాలయ నిర్మాణములను వివరించును. కాకతీయ చారిత్రమునకు ఈశాసన మమూల్యమయినది ఇందు కాకతీయులు చతుర్థకులజులని స్పష్టముగా వర్ణితమైనది.

## 21

౧ బూదపూరు : (మహబూబునగరుజిల్లా)
మసీదులో.
౨ గణపతిదేవుడు
౩ శా. శ. ౧౧౫౪
౪ సంస్కృతాంధ్రములు
౫ గణపతిదేవుని పేర మల్యాలగుండయ తటాకము నిర్మించినట్లు తెలుపును. గుండయవంశవృక్షము కలదు. రుద్రదేవుని జీవితకాలములోనె గణపతి దేవుడు రాజ్యపరిపాలనమందు పాలుగొనుచుండె నని యిది తెలుపుచున్నది.

## 22

౧ వరంగల్లు :
ఖాన్ సాహెబుతోటవద్ద.
౨ గణపతిదేవుడు
౩ సర్వధారి
౪ తెలుఁగుభాష
౫ పైభాగము తెగఁగొట్టబడినది.
వీరభద్రేశ్వరునికి ధర్మముగా రాజు వర్తకపుసరకుల మీఁదవచ్చు నాదాయము నిచ్చినట్లు తెలుపును. ఆకాలపుసుంకములు దిగుమతివస్తువులు తెలుపును. భాషావిషయకముగా ఇందలి పదరూపములు గమ నింపఁదగినవి.

## 23

౧ ముప్పవరము : (వరంగల్ జిల్లా)
చెరువునద్దిగుట్టమీద.
౨ గణపతిదేవుడు
౩ *
౪ తెలుఁగు
౫ తాయికఱుకులది
పంతబొల్లిరెడ్డి కుమారుఁడు మల్లిరెడ్డి రామేశ్వర దేవర ప్రతిష్ఠచేసిన ధర్మమును దెలుపు . రెడ్లలో పంటరెడ్ల యునికినిగూర్చి తెలుపు ప్రాచీననిదర్శన మిదియే. ఇందు రెడ్డి, రడ్డిపదములు సమానార్థకములుగా వాడఁబడినవి.

## 24

౧ మట్టెవాడ : (వరంగల్ జిల్లా)
కటికి రామన్న ఇంటిదొడ్డిలో
౨ గణపతిదేవుడు
౩ *
౪ తెలుఁగు
౫ గణపతిదేవుని బిరుదవిశేషములను తెలుపును. ఇందలి యుపమన్యునకును నెం. ౫౨ రు. శాసనమునందలి యుపమన్యు మునికినిఁగల సంబంధము మృగ్యము.

## 25

౧ సోమవరము : (నల్లగొండజిల్లా)
మూసీనదియొడ్డున జీర్ణాలయములో.
౨ గణపతిదేవుడు
౩ దుర్మతిసంవత్సరము
౪ తెలుఁగు
౫ కాకతీయ ౧౪, ౧౫, ౨౫, ౨౬ శాసనములు ఒక్క శిలాస్తంభముమీఁదనే మూడువైపుల చెక్కఁ బడినవి. భీమనాథుఁడను నాతడు స్వయంభూ దేవరకు చేసిన ధర్మమును తెలుపును.

## 26

౧ సోమవరము : (నల్లగొండజిల్లా)
మూసీనదియొడ్డున జీర్ణాలయములో.
౨ గణపతిదేవుడు
౩ *
౪ తెలుఁగు
౫ కాకతీయ ౧౪, ౧౫, ౨౫, ౨౬ శాసనములు ఒక్క శిలాస్తంభముమీదనే చెక్కఁబడినవి.
గణపతిదేవమహారాజులకు రేచెఱ్ల రుద్దురడ్డికి పుణ్యముగా జేయబడిన ధర్మమును దెలుపును. ఈ రుద్దురడ్డి రేచెర్ల వంశీయుడును గణపతిదేవుని సేనానియునగు రుద్రసేనానియు నొక్కరేయనుట కభ్యంతరములు గానరావు.

## 27

౧ చినకందుకూరు: (వరంగల్లుజిల్లా)

౨ గణపతిదేవుఁడు

౩ శుభకృతు

౪ తెలుఁగు

౫ ఈ శాసనమునందలి ధర్మముఁ జేసిన యాతని పేరు తెలియదు. ఇందలి విడ్డవారము నడ్డవారమునకు రూపాంతరము గానోపును.

## 28

౧ చినకందుకూరు: (వరంగల్లుజిల్లా)
గ్రామముచెంతి పొలములో

౨ గణపతిదేవుఁడు

౩ విభవ

౪ తెలుఁగు

౫ అపరిచితుఁడగు నొకని ధర్మమును దెల్పును.

## 29

౧ నాగులపాడు: (వరంగల్లు జిల్లా)
దక్షిణపు టాలయపు ద్వారశాఖపై

౨ గణపతిదేవుఁడు

౩ రక్తాక్షి

౪ తెలుఁగు

౫ గణపిరెడ్డియు, మల్లిరెడ్డియు కలిసి తమ తండ్రి కామిరెడ్డికిని, తమ తల్లి కామసానికిని, తమకును బుణ్యముగా నిచ్చిన ధర్మమును దెలుపును.

## 30

౧ నాగులపాడు: (నల్లగొండజిల్లా)
దేవాలయపు దక్షిణభాగమున

౨ గణపతిదేవుఁడు

౩ రక్తాక్షి-క్షయ

౪ తెలుఁగు

౫ కామయ, నామయ, మల్లయలు తమ తండ్రి కాట్రెడ్డికి, తల్లి పారసానమ్మకు పుణ్యముగా నిచ్చిన ధర్మమును దెలుపును. కామయనామయలు క్షయ సంవత్సరములో చేసిన వేర్వేరు ధర్మములను గూడ తెలుపును అప్పటికి బహుశః మల్లయ చనిపోయి యుండును.

## 31

౧ పమ్మి: (వరంగల్లు జిల్లా)
విష్ణ్వాలయములో

౨ గణం రుద్రదేవమహారాజులు

౩ శా. శ. ౧౧౫౬

౪ తెలుఁగు

౫ శిల గచ్చుదిమ్మలో నిముడ్చుటచే ప్రక్కలయందలి యక్షరములు కనుపడుటలేదు.
పమ్మియందు ప్రసన్నవల్లభదేవరను, దేసనప్రగడ ప్రతిష్ఠ చేయింపఁగా, శ్రీమన్మహాసామంతవిర్యాల నాగసానమ్మ మొదలగు వారు చేసిన ధర్మములను తెలుపును. ఆకాలపు దేవాలయ పూజావిధానములు, వృత్తినిర్మాణములు నెఱుంగుటకు ఈశాసనమనుకూలించుచున్నది. ఈ వంశీయులకును కాకతీయులకును సన్నిహితసంబంధములుండియుండినవి.

## 32

౧ బూర్గుగడ్డ: (నల్లగొండజిల్లా)
నరసింహాలయములో, స్తంభముపై.

౨ రుద్రదేవమహారాజులు

౩ శా. శ. ౧౧౮౦

౪ తెలుఁగు

౫ రుద్రమదేవి ప్రధానియగు సత్రము బొల్లమరాజుంగారి తమ్ముఁడు చేసిన ధర్మమును తెలుపును. ఇందలి మొదటిశ్లోకమునుబట్టి యీకాలమునందు వైష్ణవమతము వ్యాపించియున్నట్లు తెలియనగును. గణపతిదేవుడు క్రీ. శ. ౧౨౬౦ లో మరణించుటకు కొన్ని సంవత్సరములకు పూర్వమునుండియు నాతని పుత్రిక రుద్రాంబ యాతనితో చేరి రాజ్యమేలుచుండినటు లీశాసనమునుండి తెలియుటచే నియ్యది కాకతీయ చరిత్రమునకు చాల ముఖ్యమైనది.

## 33

౧ పానుగల్లు: (నల్లగొండజిల్లా)
ఛాయాసోమేశ్వరాలయములో

౨ రుద్రదేవమహారాజు

౩ *

౪ తెలుగు

౫ తంత్రపాలుమల్లినాయకుఁడు చేసిన ధర్మమును దెలుపును. ఇందలి రుద్రదేవుడు పురుషనామఖ్యాతేయగు రుద్రాంబికయే.

## 34

౧ పానుగల్లు: (నల్లగొండజిల్లా)

౨ రుద్రదేవుఁడు

౩ శా. శ. ౧౧౮౪

౪ తెలుగు

౫ పానుగల్లులోని ఛాయాసోమనాథదేవరకు ప్రౌఢ ప్రతాపచక్రవర్తి సారంగపాణిదేవుఁడు చేసిన ధర్మమును దెలుపును. ఈ రాజన్యుఁడు పానుగంటి స్థలమున కధిపతియు, గణపతిరుద్రమాంబలకు సామంతుఁడును, దేవరాడ భూపతి, జజ్జలదేవ, భోజరాజు లకు శత్రువునై యుండెను. ఈతఁడు తిక్కన కృతమగు నిర్వచనోత్తరరామాయణమునం దాంధ్ర చోడవంశోద్భవుడగు తిక్కనరపాలునకు శత్రువుగ చేర్కొనఁబడిన మహారాష్ట్రసామంతుడగు సారంగుడే యని తోఁచుచున్నది. శేవుణవంశీయులును, దేవగిరియాదవులకు బంధువులు నగు వీర లాంధ్ర దేశమునకు వచ్చుటకు పూర్వ ముత్తరదేశమునందలి రాజులతో బోరియుండిరని యీశాసనమునుండి తెలియుచున్నది. వీరి శాసనములు నెల్లూరుమండలమున గాంచనగుచున్నవి. (చూ. Nellore Inscriptions.)

## 35

౧ పానుగల్లు: (నల్లగొండజిల్లా)

౨ ప్రతాపరుద్రుఁడు

౩ శా. శ. ౧౨౧౩

౪ తెలుగు సంస్కృతము

ఈ శాసనము పలుతావుల చెడిపోయినది. ప్రతిబింబ మస్పష్టము. ఇయ్యది కాకతీయచరిత్రమున కమూల్యమైనది. రుద్రాంబిక గణపతిదేవుని కూతురనియు నామె జీవించియుండగనే కుమారనామాంచితుడై యామె దౌహిత్రుడగు ప్రతాపరుద్రు డామెతో చేరి రాజ్య మేలుచుండెననియు నీ శాసనమునుండి తెలియుచున్నవి.

## 36

౧ బూదపూరు: (మహబూబునగరుజిల్లా)
జీర్ణశివాలయపు గోడపై.

౨ రుద్రదేవమహారాజులు

౩ శా. శ. ౧౧౯౮

౪ సంస్కృతాంధ్రములు

౫ వర్ణములు సౌష్ఠవములు
మల్యాలగుండయ ధర్మపత్నియగు కుప్పాంబిక తన స్వర్గీయభర్తపేర లింగప్రతిష్ఠ గావించి, ఆదేవర పూజాదికములకు చేసిన ధర్మములను వివరించును. ఈమె గోనవంశమునందు పుట్టినది. ఈశ్వరభట్టోపాధ్యాయులవారు ఈశాసన రచయిత.

## 37

౧ పామాపురము: (మహబూబునగరుజిల్లా)
చిలుకలతిప్ప అను చేనిలో

౨ రుద్రదేవుఁడు

౩ శా. శ. ౧౨౦౦

౪ తెలుఁగు

౫ విడెముమాదయ అనువాఁడు రామనాథదేవరకు ధర్మముగా పొన్నముచ్చగ్రామసుంకము లిచ్చినట్లు తెలుపును.

## 38

౧ పామాపురము; (మహబూబునగరుజిల్లా)
చిలుకలతిప్ప అను చేనిలో

౨ రుద్రదేవుఁడు
౩ శా. శ. ౧౨౦౦
౪ తెలుఁగు
౫ అన్నమరాజనువాఁడు రామనాథదేవరకు ధర్మముగా పొన్నముచ్చ గ్రామ బుఱ్ఱ సుంకా లిచ్చినట్లు తెలుపును.

## 39

౧ కొలనుపాక: (నల్లగొండజిల్లా) సోమనాథాలయములో.
౨ రుద్రదేవమహారాజులు
౩ *
౪ సంస్కృతము
౫ కాకతీయుల సేవకుఁడగు పోతినాయకుని ధర్మమును దెలుపును. కాకతీయవంశచారిత్రమున కీ శాసనము మిక్కిలి యమూల్యమైనది. ప్రోలునినుండి రుద్రాంబవరకు వంశవృక్షమును వివరించును. రుద్రాంబ గణపతిదేవుకూఁతురనియు, చాళుక్యవంశీయుఁడగు ఇందుశేఖరుని కొమారుఁడగు వీరభద్రుఁడు ఆమె భర్తయనియు తెలుపును. దీనిని కాకతీయ నెం ౩౫ ర శాసనముతో చేర్చి చదువవలెను.

## 40

౧ బూరుగుగడ్డ: (నల్లగొండజిల్లా) వరాహనృసింహస్వామిగుడిలో
౨ *
౩ *
౪ తెలుఁగు
౫ ఒకానొకని ధర్మమును దెలుపును. దేవాలయపు టుద్యోగులను వారి భత్యములను వివరించును.

## 41

౧ బూరుగుగడ్డ: (నల్లగొండజిల్లా) వరాహనరసింహస్వామిగుడిలో
౨ *
౩ *
౪ తెలుఁగు
౫ అమజయ్య గణపదేవుఁడు చేసిన ధర్మమును దెలుపును. ఈతనికి ,, సర్వలోకాశ్రియ '' ,, విష్ణువర్ధన చక్రవర్తి '' అను బిరుదములు కలవు.

## 42

౧ బూరుగుగడ్డ: (నల్లగొండజిల్లా) వరాహనృసింహస్వామిగుడిలో
౨ *
౩ *
౪ తెలుఁగు
౫ ఈ శాసనాంత్యభాగమునం దాంధ్రచోడబిరుదాంచితుడగు నొక మహామండలేశ్వరుడు పేర్కొనబడియున్నాడు. నెం. ౪౦, ౪౧, ౪౨ ర్లు ఒకశిలమీద నేయున్నవి.

## 43

౧ గణపవరము: (నల్లగొండజిల్లా) విష్ణ్వాలయములో.
౨ ప్రతాపరుద్రుడు
౩ శా. శ ౧౨౧౪
౪ తెలుఁగు
౫ మహాప్రధాని గంగి దేవనింగారి ధర్మమును దెలుపును. ఇందు రాజు ,,ప్రతాపకుమార రుద్రదేవమహారాజులు'' అని వ్రాయఁబడినది.

## 44

౧ గజగట్లపల్లి: (మెదకుజిల్లా) ఆంజనేయాలయము ముందు
౨ *
౩ *
౪ తెలుఁగు.
౫ ఈ శాసనమును విరుగగొట్టి ఒక ఖండము గజగట్లపల్లిలోను, మరియొక ఖండము మణూరులోను పడవేసినారు. దీనిని నెం ౪౫ ర మణూరుశాసనముతో కలిపి చదువవలయును.

## 45

౧ మణూరు : (మెదకుజిల్లా)
సోమనాథాలయములో.
౨ ప్రతాపరుద్రుడు
౩ శా. శ ౧౨౧౮
౪ తెలుగు
౫ ఈ శాసనమును నెం ౪౪ రుతో కలిపి చదువునది. దీనినుండి అనుమకొండ అంన్న వెంక, విశ్వము రుద్రయయను ప్రతాపరుద్రుని సామంతు లిరువురు తెలియనగుచున్నారు. కర్నూలుమండల స్థానిక చరిత్రములయందుగూడ వీరి ప్రశంస గలదు.

## 46

౧ అలంపురము : (రాయచూరుజిల్లా)
౨ ప్రతాపరుద్రదేవుడు
౩ శా. శ ౧౨౨౧
౪ తెలుగు
౫ ముమ్మడి బ్రమ్మిశెట్టి మొదలగు సెట్లు, వీరభద్ర సాంప్రదాయులగువారు చేసిన ధర్మమును వివరించును. విజయనగర శాసనముల యంత్యభాగమున గాంచనగు ని విరూపాక్ష నామ మిాశాసనప్రారంభమున చెక్కబడియున్నది. బహుశః ఇయ్యది యిటీవల లిఖింపబడియుండవచ్చును.

## 47

౧ నాగులపాడు : (నల్లగొండజిల్లా)
రెండుగుళ్ళమధ్య మసీదునకెదురుగా పూడియున్నది.
౨ ప్రతాపరుద్రుడు
౩ శా. శ ౧౨౨౫
౪ తెలుగు
౫ రాజునకు పుణ్యముగా ఆ యూరిలోని ౧౮ కులములవారు చేసిన ధర్మమును వివరించును.

## 48

౧ లేకుమాల : (మెదకుజిల్లా)
ఆంజనేయాలయములో.
౨ ప్రతాపరుద్రుడు.
౩ శా. శ ౧౨౩౦
౪ తెలుగు
౫ ప్రతాపరుద్రుని మహాప్రధాని పురవరి మహాదేవ నాయంకుల ధర్మమును దెలుపును.

## 49

౧ మాటూరు : (వరంగల్ జిల్లా)
౨ ప్రతాపరుద్రుడు.
౩ శా. శ. ౧౨౩౨
౪ తెలుగు
౫ అసంపూర్ణ శాసనము

## 50

౧ మేళ్ళచెరువు : (నల్లగొండజిల్లా)
స్వయంభూదేవాలయములో.
౨ ప్రతాపరుద్రుడు.
౩ శా. శ ౧౨౩౩
౪ తెలుగు
౫ స్థానికులగు వివిధవర్ణములవారు శ్రీ స్వయంభూదేవరకు చేసిన ధర్మములు తెలియుచున్నవి. ఈ శాసనమున వెలమ, కోమటికులములు పేర్కొనబడియున్నవి.

## 51

౧ ఒరంగల్లు :
గుడిముందట.
౨ *
౩ *
౪ సంస్కృతము
౫ కాకతీయవంశములో ప్రోలుడు జనించినట్లు తెలుపుచున్నది. అసంపూర్ణశాసనము.

## 52

౧ వరంగల్లు :
గుడిముందట.
౨ *

౩ *

౪ సంస్కృతము

౫ ఈశాసనము పలుతావుల చెడిపోయినది.
ప్రారంభమున ప్రోలుని తండ్రినిఁగూర్చి తెల్పి యుండవచ్చును. ప్రోలుఁడు, ఈతనికొడుకు మహాదేవుఁడు ఇందు పేర్కొనఁబడినారు. ఉపమన్యు మునియు, శైవాచార్యుఁడగు ధృవేశ్వర మునీశ్వరుఁడును పేర్కొనఁబడినారు. వీ రిద్వురును చరిత్ర కపరిచితులు. నెం. ౨౪ వ శాసనమునుచూచునది.

## 53

౧ రుద్రేశ్వరము: (హనుమకొండ)
హనుమకొండ పెద్దదేవాలయములో

౨ *

౩ *

౪ తెలుఁగు

౫ గోసగియాశ్వరదేవుఁడనువాఁడు తమ్మేలిన కాకతీయ రాజులకు రాజ్యాభివృద్ధిగాను పెక్కుదేవరలను ప్రతిష్ఠ చేసెనని తెలుపును. సహస్రస్తంభముల గుడికి రుద్రేశ్వరము అనిపేరు.

## 54

౧ మాటూరు: (వరంగల్ జిల్లా)

౨ *

౩ శా. శ. ౧౦౪౧

౪ తెలుఁగుపద్యములు

౫ ఈ శాసనము మధ్య మధ్య చెడిపోయియుండుటచే ప్రతిబింబమస్పష్టముగ నున్నది. త్రిభువన మల్లదేవుని సామంతుఁ డొకఁడు దాయాదు లపహరించిన ఆంధ్రసామ్రాజ్యమును తిరిగి కాకతీయులకు సంపాదించిపెట్టినటుల తెలుపుచున్నది. ఈ శాసనము కాకతీయుల పూర్వచరిత్రమును దెలుపుటలో నద్వితీయప్రాముఖ్యతఁగలది. ఇందలి విషయములు భావిపరిశోధనమునఁ గాని సమన్వయింప వలనుపడదు.

## 55

౧ గూడూరు: (వరంగల్ జిల్లా) గ్రామమధ్యమున

౨ *

౩ *

౪ తెలుఁగుపద్యములు

౫ దుర్జయవంశానుక్రమణికను దెలుపును. ఎఱ్ఱనరేంద్రుఁడు బొట్టబేతరాజు పక్షమువహించి, అతనిని కొఱవిదేశమునకు ప్రభువుగాఁ జేసెనని తెలుపుచున్నది. ఎఱ్ఱనభార్య ఆతనిని కాకతివల్లభునిగాఁ జేసినది. ఈశాసనము కాకతీయుల యుత్పత్తిని గూర్చి ఆద్భుతాంశములను బయలుపెట్టుచున్నది. ఇందలి విషయములు పరిశోధనీయములు. దీనితో నెం. ౫౪ వ శాసన మన్వయింప నగును. చాళుక్య నె ౩౫, ఇతర ౧౩ ర్లు ఈ శిలమీద నేయున్నవి.

## 56

౧ ధర్మసాగరము: (వరంగల్ జిల్లా)
దేవాలయము ముందర.

౨ *

౩ *

౪ సంస్కృతాంధ్రములు

౫ ఈశాసనము మిక్కిలి చెడిపోయి. ప్రతిబింబము దుస్సాధ్యముగ నున్నది. దీనినుండి గణపతిదేవుని మంత్రియు, భాస్కరమంత్రి పుత్రుడునగు మల్లమంత్రి తెలియనగుచున్నాడు.

## 57

౧ ఇనుగుర్తి: (వరంగల్లుజిల్లా)

౨ *

౩ *

౪ సంస్కృతము

౫ ఈశాసనము నాగరలిపిలోనున్నది. ఇందు విశేష భాగములలో బెత్తికలు లేచిపోయి ప్రతిబింబ మస్పష్టముగ నున్నది. ప్రోలరాజునకును ముప్పాంబికకును బుత్రుడగు రుద్రదేవుడు మేలాంబికను వివాహమాడి సప్తసంతానములను బ్రతిష్ఠించెనని యీశాసనమున చెప్పబడియున్నది. దానసంవత్సర ముండెడిభాగము చెడిపోయినది.

## చాళుక్య శాసనములు



### 1

౧ గంగాపురము: (మహబూబునగరుజిల్లా)

౨ జగదేకమల్లుఁడు

౩ ౧౮ వ రాజ్యసంవత్సరము

౪ కన్నడము

౫ ఆయూరి సెట్టికులజులు సగరేశ్వరదేవుని ప్రీతికై శ్రీగిరి పండితునికి చేసిన ధర్మమును తెలుపును. ఈ శ్రీగిరిపండితుడు ఆలయస్థానపతిగ నుండవలెను. చాళుక్య ౧, ౨ శాసనములు ఒకేశిలపై నున్నవి.

### 2

౧ గంగాపురము: (మహబూబునగరుజిల్లా)

౨ జగదేకమల్లుఁడు

౩ ౮ వ రాజ్యసంవత్సరము

౪ కన్నడము

౫ కొందరు సెట్టికులజులును, ప్రజలును సాగరేశ్వర, సోమేశ్వర దేవరలకు చేసిన ధర్మమును తెలుపును. చాళుక్య ౧, ౨ శాసనములు ఒకేశిలపై నున్నవి.

### 3

౧ కొలనుపాక: (నల్లగొండజిల్లా) చండికాంబగుడిలో.

౨ జగదేకమల్లుఁడు

౩ *

౪ కన్నడము

౫ ఈశాసనమునందలి తూర్పుభాగము జగదేకమల్లుని మంత్రియగు మనెవెగ్గడను పేర్కొనుచున్నది. పశ్చిమభాగమునత్రిభువనమల్లునికాలపు శాసనము.

### 4

౧ కొలనుపాక: (నల్లగొండజిల్లా) సోమనాథస్వామి గుడిలోని గోడలో.

౨ జగదేకమల్లుఁడు

౩ *

౪ కన్నడము

౫ మహామాత్యుఁడగు శ్రీమన్మనెవెగ్గడెను పేర్కొనును. అసంపూర్ణశాసనము.

### 5

౧ గంగాపురము: (మహబూబునగరుజిల్లా)

౨ జగదేకమల్లుఁడు

౩ ధాతుసంవత్సరము

౪ కన్నడము

౫ జగదేకమల్లుని తనయుడు త్రైలోక్యమల్లకేశవపురమున నొక దానముఁ జేసెననియు, దాఖిసెట్టి దానిని నడుపువాఁడనియును, పిమ్మట నచ్చటి నాలుగు సెట్టికులములవారును, సమస్తసమయముల వారునుగూడ ధర్మములను జేసియుండిరనియు నీ శాసనమునుండి తెలియుచున్నది.

### 6

౧ అలంపురము: (రాయచూరుజిల్లా) ఈశ్వరాలయములో

౨ త్రైలోక్యమల్లుఁడు

౩ చా. వి. శ. ౮౩

౪ కన్నడము

౫ ఒకానొకని దానమును తెలుపును.

### 7

౧ డాకూరు: (మెదకుజిల్లా) వీరభద్రాలయములో

౨ త్రైలోక్యమల్లుఁడు

౩ శా. శ. ౧౦౧౩. త్రైలోక్యమల్లుని రాజ్యసంవత్సరము ౩, అంగీరస.

౪ కన్నడము
౫ మహామండలేశ్వర సోమెమ్మార్కడి డాకూరులో బజ్జేశ్వరుని ప్రతిష్ఠించెను. అచ్చట నేయుండిన అయశేశ్వరునకు మార్తాండరసమున్నగువారు దాన మొసగిరి. ఈశాసనమునుండి తాత్కాలికదేవాల యోత్సవాదులు కొన్ని తెలియనగుచున్నవి.

## 8

౧ నంబులకుంట: (మహబూబునగరుజిల్లా)
చెఱువుకట్టమీద
౨ త్రైలోక్యమల్లుఁడు
౩ *
౪ కన్నడము
౫ త్రైలోక్యమల్లుని మహాప్రధానియగు మనెవెర్గడె యిందు పేర్కొనబడియున్నాడు. చోడవంశో ద్భవుఁడగు సంకరసచోడమహారాజునకును పద్మల దేవికిని జనించిన మల్లమాణిదేవి ధర్మము నీశాసనము తెలుపుచున్నది.

## 9

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
౨ త్రైలోక్యమల్లుఁడు
౩ *
౪ కన్నడము
౫ అసంపూర్ణశాసనము. ఇందు మహామండలేశ్వర నిరుగసిచోళమహారాజు పేర్కొనఁబడినాఁడు. ఇతఁడు రాజసామంతుఁడు. ఆంధ్రచోడులలో నొకడు. శాసనాంత్యభాగమునం దీతని మంత్రిని గూర్చిన ప్రస్తావనగలదు. అవలిభాగము నేలలో పూడియున్నది.

## 10

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
శాలబ్రహ్మేశ్వరుని గుడిప్రక్కన.
౨ త్రైలోక్యమల్లుఁడు
౩ *

౪ కన్నడము
౫ అసంపూర్ణశాసనము. ఇందు మహామండలేశ్వర బిద్దనచోడమహారాజు పేర్కొనఁబడినాఁడు. ఇతఁడు సామంతప్రభువై, తెలుఁగు చోళులలో నొక్కరుడైయుండి దత్తమండలశాసనములలోని బిద్దనచోడుఁడై యుండును.

## 11

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
శాలబ్రహ్మేశ్వరుని గుడిప్రక్కన
౨ భువనైకమల్లుఁడు
౩ చా. వి. శ. ౯౮ నళసంవత్సరము
౪ కన్నడము
౫ అలంపురములోని శ్రీబ్రహ్మేశ్వరదేవరకు శ్రీమద్వడ్డె రావుళదండనాయకులు చేసిన ధర్మమును దెలుపును. ఈదానము స్థానపతి బ్రహ్మరాసి భట్టారకునికి చేయబడినది. ఇందు చాళుక్యవిక్రమ శకమునకు బదులుగా శకవర్షమీయబడియున్నది. ఈశాసన మునుండి యాకాలమునందు దేవపూజోపయోగ్య ములగు వస్తువులు తెలియుచున్నవి.

## 12

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
వేంకటేశ్వరాలయము ముందు.
౨ త్రిభువనమల్లుఁడు
౩ చా. వి. శ ౧
౪ కన్నడము
౫ త్రిభువనమల్లుని రాజ్యకాలమునం దాతనికి సామంతుడగు నొక చోడరాజు బ్రహ్మేశ్వరదేవునికిఁ బ్రీతిగా నచ్చటి స్థానపతి కొనర్చిన ధర్మము నీ శాసనము తెలుపుచున్నది. ఈ శాసనకాలము ఒక టవచాళుక్యవిక్రమ శకసంవత్సరముగా నున్నది. ఈ శకము త్రిభువనమల్లబిరుదాంచితుడును, పశ్చిమ చాళుక్యచక్రవర్తియు నగు నాఱవవిక్రమాదిత్యుని రాజ్యారంభకాలమగు క్రీ. శ. ౧౦౭౫—౧౦౭౬

సంవత్సరమునుండి ప్రారంభమగును. ఈ శాసనము పలుతావుల చెడిపోయియుంటచే ప్రతిబింబ మస్పష్టముగ నున్నది.

## 13

౧ వేములవాడ: (కరీంనగరుజిల్లా)
భీమేశ్వరాలయము ముందు.
౨ త్రిభువనమల్లుఁడు
౩ చా. వి. శ. (౨) అవ్యయసం॥
౪ కన్నడము
౫ ఈ శాసనపు పశ్చిమభాగమున త్రిభువనమల్లుని పుత్రుడగు కుమారసోమేశ్వరుని ధర్మమును, ఉత్తర భాగమున పొళవాకకులతిలకుడగు మహామండలేశ్వరజగద్దేవుడు హారీశ్వరదేవునికిఁ బ్రీతిగాఁ నీశ్వర పండితునికిఁ జేసిన ధర్మమును పేర్కొనబడి యున్నవి. ఈ జగద్దేవుడును, కాకతిరుద్రుని హను మకొండశాసనమందలి జగద్దేవుఁడు నొక్కరేయై యుండవలెను.

## 14

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
యోగానందనారసింహాలయము
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ (౨) ౩ వ్యయ
౪ కన్నడము
త్రిభువనమల్లుని రాజ్యమున మహాస్థానాధిపతి ధర ణీంద్రరాశి పండితుని పాలనమున సమస్తజనులును కూడి చేసిన ధర్మము నీ శాసనము తెలుపుచున్నది.

## 15

౧ గంగాపురము: (మహబూబునగరుజిల్లా)
౨ త్రిభువనమల్లుఁడు
౩ చా. వి. శ. ౩
౫ కొండబు బ్రహ్మేశ్వరదేవర కొసంగిన దానమును దెలుపును.

## 16

౧ గంగాపురము: (మహబూబునగరుజిల్లా)
చాకలివాని భావివద్ద
౨ త్రిభువనమల్లుఁడు
౩ చా. వి. శ. ౩ ప్రజాపతి సం॥
౪ కన్నడము
౫ అచ్చటి శెట్టికులజుల ధర్మము తెలియుచున్నది.

## 17

౧ నగునూరు (కరీంనగరముజిల్లా)
ఊరిబయటనున్న శక్తిఆలయమునకు ఎదుటి విగ్రహముల దగ్గర.
౨ దొమ్మెరాజు
౩ ప్రమాది
౪ తెలుఁగు
౫ మహామండలేశ్వర దొమ్మెరాజు జగద్దేవుడు, మేడరాజు ననువారలు ఎనుబదివేల సైన్యము నెదిర్చి గెలిచిరని యీ శాసనము దెలుపుచున్నది. వారలు అనుమకొండశాసనమునందలి కాకతీయ ప్రత్యర్థులయి యుందురు.

## 18

౧ అల్లాదుర్గము: (మెదకుజిల్లా)
ఈదులలో నున్నది.
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౮ రక్తాక్షి
౪ కన్నడము
౫ త్రిభువనమల్లుని కాలమున రాజపుత్రుడగు ఆహవమల్లపెమ్మాడి చేసిన దానము తెలియనగుచున్నది.

## 19

౧ వేములవాడ: (కరీంనగరుజిల్లా)
సోమేశ్వరాలయము ముందు
౨ త్రిభువనమల్లదేవుఁడు
౩ చా. వి. శ. ౮

౪ కన్నడము
౫ త్రిభువనమల్లునికాలమున నళని సామంతుఁడు రాజాదిత్యరస రాజాదిత్యేశ్వరుని ప్రతిష్ఠ చేసి యొక మహోన్నతదేవాలయమును గట్టించి, చక్రవర్తి యనుజ్ఞపై నా దేవునకుఁ గొన్ని ధర్మములను జేసి నటు లీశాసనము తెలుపుచున్నది.

## 20

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
బాలబ్రహ్మేశ్వరునిగుడి పశ్చిమద్వారమున.
౨ *
౩ చా. వి. శ. ౧౧
౪ కన్నడము
౫ అసంపూర్ణశాసనము

## 21

౧ కొలనుపాక: (నల్లగొండజిల్లా)
ఆంజనేయులగుడిముందర.
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౧౩
౪ కన్నడము
౫ అసంపూర్ణశాసనము. ప్రతిబింబము దుస్సాధ్యముగ నున్నది. కందూరుశాఖకు జెందిన చోడవంశీయులలో నొకడును, త్రిభువనమల్లుని సామంతుడునగు నొక రాజన్యుని దానము నీ శాసనము తెలుపుచున్నది.

## 22

౧ గంగాపురము: (మహబూబునగరుజిల్లా)
కేశవాలయము గోడమీద.
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౧౫ ప్రజోత్పత్తి
౪ కన్నడము
౫ త్రిభువనమల్లునికి గురువగు సకలప్రవేశభట్టారకుడు, జ్యోతిశ్శాస్త్రప్రవీణుడగునాదిత్యభట్టోపాధ్యాయునికి, చక్రవర్తి యశోభివృద్ధికై యొనర్చిన ధర్మము నీ శాసనము తెలియజేయుచున్నది.

## 23

౧ కొలనుపాక: (నల్లగొండజిల్లా)
సోమనాథాలయముముందర,
౨ *
౩ చా. వి. శ. ౨౨ ఈశ్వర
౪ కన్నడము
౫ అసంపూర్ణశాసనము. ఇందునుండి కొట్టిపాక రాజధానిగ పేర్కొనబడియున్నది. ఇచ్చట నొక రాజప్రతినిధి యుండి యుండును.

## 24

౧ గంగాపురము; (మహబూబునగరుజిల్లా)
వినాయకునిగుడివద్ద
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౨౩ ఈశ్వర
౪ కన్నడము
౫ ఈ శాసనమున చా. వి. శ. ౨౩, ౪౨ సంవత్సరములు గలవు. ఇందుకుఁ గల కారణము తెలియుట లేదు. గంగాపురమునకు త్రైలోక్యమల్లకేశవపురమను నామాంతర ముండియుండును.

## 25

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
జువ్విచెట్టు వేపచెట్టు అరుగుమీద పఱచిన బండ
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౨౫. ఖర
౪ కన్నడము
౫ మహారాణి మన్నాదేవిధర్మ మీ శాసనమునఁగలదు.

## 26

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
బాలబ్రహ్మేశ్వరుని గుడిప్రక్క.
౨ త్రిభువనమల్లుడు

౩ చా. వి. శ. ౨౩. కాళయుక్తి
౪ కన్నడము
౫ మహామండలేశ్వర మల్లరస మహాస్థానాధిపతి సోమేశ్వరరాశిభట్టారకునికి, బ్రహ్మేశ్వరదేవుని ప్రీతికై చేసిన ధర్మ మీశాసనమునుండి తెలియుచున్నది.

## 27

౧ గంగాపురము: (మహబూబునగరుజిల్లా)
ఆలయప్రాకారములో
౨ *
౩ చా. వి. శ. ౨౮
౪ కన్నడము
౫ స్థానికులగు సెట్టికులజులును, సమస్తసమయములవారును గూడి ధర్మము చేసి వేయించిన శాసనము. చాళుక్య సె ౩౨ రు కూడ ఈశిలమీద నేయున్నది.

## 28

౧ పూడూరు: (మహబూబునగరుజిల్లా)
ఆలయమువద్ద కంపలో
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౨౯
౪ కన్నడము
౫ త్రిభువనమల్లుని సామంతుడగు మహామండలేశ్వర మల్లకరస తన గురువును జైనమతప్రవర్తకుడునగు కనకసేన భట్టాచార్యునికి చేసిన ధర్మమును దెలుపు శాసనము. దానినుండి యా కాలమునందు జైనమతము ప్రబలియుండినటుల తెలియుచున్నది.

## 29

౧ కొలనుపాక: (నల్లగొండజిల్లా)
సోమనాథాలయములో
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౩౦ సర్వజిత్
౪ కన్నడము
౫ త్రిభువనమల్లుని దండనాయకులగు బాణసువెగ్గడె అనన్తపాలయ్య యనువారలు రాజధానియగు కొల్లిపాకయందలి రాజాదిత్యేశ్వరునికి జేసిన ధర్మము ఈ శాసనము తెలుపుచున్నది.

## 30

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
బాలబ్రహ్మేశ్వరునిగుడి తూర్పుద్వారమువద్ద.
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౩౯. సర్వజిత్
౪ కన్నడము
౫ సామంత మహామండలేశ్వరుడగు మల్లరస బ్రహ్మేశ్వరదేవప్రీత్యర్థమై వితరణేన్ద్రరాశి పండితునికిఁ జేసిన ధర్మము ఈ శాసనము తెలుపుచున్నది.

## 31

౧ అలంపురము: (రాయచూరుజిల్లా)
బాలబ్రహ్మేశ్వరుని గుడిప్రక్క.
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౩౯
౪ కన్నడము
౫ త్రిభువనమల్లుని దేవి ధర్మశాసనము

## 32

౧ గంగాపురము: (మహబూబునగరుజిల్లా)
ఆలయప్రాకారములో.
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౪౧
౪ కన్నడము
౫ భీమరస, గంగాదేవి యనువారు గంగేశ్వరదేవుని ప్రతిష్ఠ చేసినటులఁ దెలుపును. చాళుక్య సె ౨౩ రు ఇదియు ఒక శిలమీద నే యున్నవి.

## 33

౧ నెక్కొండ: (మహబూబునగరుజిల్లా)
రామేశ్వరాలయము ముందర.

౨ త్రిభువనమల్లుఁడు
౩ చా. వి. శ. ౪౬ ప్లవ
౪ కన్నడము
౫ చందలదేవీతనయుండును మహామండలేశ్వరుండు నగు కుమారతైలపదేవుడు తన పట్టమహిషి లక్ష్మీదేవితోడను, కుమారపెమ్మార్మాడితోడను, కోడూరి నుండి రాజ్యమేలుచు చేసిన ధర్మ మీ శాసనమున పేర్కొనబడియున్నది. ఈతడు కోడూర రాజ ప్రతినిధిగనుండి, కాకతిరుద్రుని హానుమకొండశాసనమునఁ జెప్పబడినటుల కాకతిప్రోలునికిఁ బ్రత్యర్థిగ నుండియుండెను.

# 34

౧ బూదపూరు : (మహబూబునగరుజిల్లా)
ఆంజనేయాలయమునకు ఎదురుగా.
౨ *
౩ చా. వి. ని ౪౬ ప్లవ.
౪ కన్నడము
౫ సపుత్రకళత్రుడగు కుమారతైలపదేవుడు వేయించిన దానశాసనము. దీనిని నెం. ౩౩ రు చాళుక్యశాసనముతో కలిపి చదువవలెను.

# 35

౧ గూడూరు : (వరంగల్ జిల్లా)
గ్రామమధ్యమున.
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౪౭ క్రోధి
౪ కన్నడము
౫ కొల్లిపాకనుండి కుమార సోమేశ్వరుడు రాజ్యమేలు సమయమున దండనాయక సాహిపయ్య విన్నపమాలించి మహాప్రధాని మానెవెగ్గడె చేసిన ధర్మము నీశాసనము పేర్కొనుచున్నది. కాకతీయ నెం. ౫౫ ఇతర ౧౩ ర్ల శాసనములుకూడ ఈశిల మీదనే యున్నవి.

# 36

౧ కొలనుపాక : (నల్లగొండజిల్లా)
ఊపగడ్డపయిని స్తంభముమీద.
౨ *
౩ చా. వి. శ. ౫౦ విశ్వావసు
౪ కన్నడము
౫ కుమారసోమేశ్వరుడు కొల్లిపాకనుండి రాజ్యమేలుచుండగా మంత్రియగు మానెవెగ్గడె వేసిన ధర్మశాసనము. ఇది పలుతావుల చెడిపోయినది. ప్రతిబింబము దుర్గ్రాహ్యముగ నున్నది. వ్రాత ఏమియు బాగులేదు.

# 37

౧ పానుగల్లు : (నల్లగొండజిల్లా)
వేంకటేశ్వరాలయములో.
౨ త్రిభువనమల్లుడు
౩ *
౪ సంస్కృతము
౫ ఈ యసంపూర్ణశాసనమునుండి త్రిభువనమల్లుడు రాజ్యమేలుచుండగా, భీముని తమ్ముడగు వైద్యనాథుడను నాతడు, చక్రవర్తికుమారుడగు తైలపదేవునివద్దనుండి కొంతభూభాగమును పొందెనని తెలియుచున్నది. ఈ తైలపుడు కాకతీయప్రత్యర్థియగు తైలపుడు.

# 38

౧ బూరుగుగడ్డ : (మహబూబునగరుజిల్లా)
వరాహనృసింహస్వామి గుడికి తూర్పుననున్న చిన లంకెల బావివద్ద.
౨ త్రిభువనమల్లుడు
౩ *
౪ కన్నడము
౫ బాణసువెగ్గడె అనంతపాలయ్యలను పేర్కొనుచున్నది.

## 39

౧ అల్లాదుర్గము : (మెదకుజిల్లా)
కేశవాలయములో.
౨ భూలోకమల్లుడు
౩ ౩ వ రాజ్యసంవత్సరము. కీలక.
౪ కన్నడము
౫ *
షరా :—ఇది తాడికొండ శాసనముగా పొరపాటున అచ్చుపడినది. పుట ౧౪౩.

## 40

౧ గంగాపురము : (మహబూబునగరుజిల్లా)
చోడమ్మచెలువునద్ద.
౨ భూలోకమల్లుడు
౩ భూలోకమల్లుని ౮ వ రాజ్యసంవత్సరము
౪ కన్నడము
౫ భూలోకమల్లుని కుమారుడును, యువరాజును అగు తైలపుని దండనాయకుడును, కొండరుసెట్టి కులజులును చేసిన ధర్మమును దెలుపును.

## 41

౧ కొలనుపోలు : (నల్లగొండజిల్లా)
చెఱువుగట్టునకు ప్రక్కన
౨ ఆహవమల్లుడు
౩ శ. ౯౯౯. శ్రీముఖ
౧ కన్నడము
౫ సోమపెర్మాడి, లక్ష్మీబిరసియనువారల ధర్మములు ఉత్తరపశ్చిమభాగములందు గలవు.

## 42

౧ కొలనుపాక : (నల్లగొండజిల్లా)
వీరనారాయణస్వామిగుడి గర్భాలయములో.
౨ త్రిభువనమల్లుడు
౩ చా. వి. శ. ౩౯
౪ సంస్కృతము
౫ ఈశాసనము అరడుగుల పొడుగుగలరాయిపై చెక్కబడియున్నది. అక్షరములు మిక్కిలి చిన్నవియై యొకదానినంటి యింకొకటి యున్నవి. పంక్తుల నడుమగూడ స్థలము చాల తక్కువ. అనేక స్థలములలో నక్షరము లరిగిపోయినవి.

---

# ఇతర శాసనములు

## 1

౧ ఒరంగల్లు:
కోటలో ద్వారశాఖపై
౧ రాచ్చిదేవ మహాపాత్రుడు
౩ ప్రమాది
౪ తెలుగు
౫ కాకతీయు లంతరించినపిమ్మట కొంతకాలమునకు ఓరుగల్లుకోట కపిలేంద్ర గజపతి కుమారుడగు రాచ్చిదేవ మహాపాత్రునిచే నాక్రమింపబడినటు లీశాసనమునుండి తెలియుచున్నది.

## 2

౧ నేలకొండపల్లి : (వరంగల్లుజిల్లా)
విరాట్రాయాంధ్రగ్రంథాలయములో
౨ కందూరి రుద్రయనచోడుడు
౩ శా. శ. ౧౦౪౭
౪ తెలుగు
౫ ఒకదానమును దెలుపును.
ఈ రుద్రయనచోడు డాంధ్రచోడుల సంతతివాడు.

## 3

౧ నేలకొండపల్లి : (వరంగల్లుజిల్లా)
విశ్వాత్రాయాంధ్రగ్రంథాలయములో.
౨ కృష్ణదేవరాయలు
౩ శా. శ. ౧౪౪౩ ధాతృ
౪ తెలుఁగు
౫ కృష్ణదేవరాయలకాలమున కృష్ణానది యుత్తరతీరమును కొండపల్లినుండి రాయసం కొండమరుసు పాలించుచుండెనని యీ శాసనము తెలియజేయుచున్నది.

## 4

౧ నాగులపాడు : (నల్లగొండజిల్లా)
గుడిద్వారముముందర అడ్డరాతిపై
౨ యేలీసుఖాను
౩ శా. శ. ౧౪౬౪ క్రోధి
౪ తెలుఁగు
౫ రెడ్లసమక్షమున జేయబడిన యొక దానమును దెలుపును.

## 5

౧ పానుగల్లు (నల్లగొండజిల్లా)
గోరీలవద్దనున్న శకలము.
౨ *
౩ *
౪ సంస్కృతము
౫ ఇందునుండి మైలాంబిక, భీమరాజనందనుడగు తాండక్షితీశుడు ననువారు తెలియనగుచున్నారు. వీరు చరిత్ర కపరిచితులు.

## 6

౧ జడచర్ల : (మహబూబునగరుజిల్లా)
వేంకటేశ్వరాలయములో.
౨ కందూరి ఉదయనచోడుడు
౩ శా. శ. ౧౦౭౪. చిత్రభాను
౪ తెలుఁగు
౫ ఈతని సుంకాధికారులు కోడూరిలోని స్వయంభు సోమనాథున కిచ్చిన ధర్మములను దెలుపును. ఈ శాసనమునుండి స్థలము సుంకమను పన్నును, గోకర్ణసింగరూక అను నాణెములును దెలియుచున్నవి.

## 7

౧ ఆలుగడప : (నల్లగొండజిల్లా)
౨ ఎఱ్ఱమనాయనింగారు
౩ శా. శ. ౧౧౨౭
౪ తెలుగు
౫ ఇందలి గుండపనాయనింగారు చరిత్రమున కపరిచితుడు. ఈ శాసనమునుండి యాతడు వడ్లూరునకు పాలకుడనియు, నాతని మంత్రి సింగమదేవనాయంకు డనియుఁ దెలియుచున్నది.

## 8

౧ సంగాపురము : (మహబూబునగరుజిల్లా)
౨ *
౩ *
౪ సంస్కృతము
౫ అసంపూర్ణ శాసనము. వెన్నమహీపతిని పేర్కొనుచున్నది.

## 9

౧ రామన్నపేట : (వరంగల్ జిల్లా)
చెఱువుతూముమీఁద.
౨ మహాసామంతమల్లెడ్డి
౩ శా. శ. ౧౧౩౫
౪ తెలుగు
౫ ఇందలి మల్లెడ్డి చరిత్ర కపరిచితుడు. ఈతని తండ్రి ముప్పారెడ్డి యని చెప్పబడియున్నది. వీరు రెడ్డికులజులయియుందురు. ఈ శాసనశిలను రెండు ఖండములు చేసి తూమునకు వేర్వేరుతావులను బిగించిరి. ప్రత్యేకఖండములకుఁ బ్రతులు దీసి కలిపిన శాసనము.

## 10

౧ గార్ల : (వరంగల్లుజిల్లా)

౨ బొప్పరాయలు

౩ శా. శ. ౧౨౦౯

౪ సంస్కృతము

౫ అసంపూర్ణ శాసనము. ఇయ్యది పద్మనాయకవంశ చరిత్రమునకు చాల ముఖ్యమైనది. చతుర్థకులమున బేతభూపతియు, నాతనికి బొప్పడును, అతనికిఁ గణనాధుఁడు నాతనికి బొప్పరాయలునుజన్మించిరి. ఈ రెండవ బొప్పరాయ లెవ్వరికి సామంతుడో తెలియుటలేదు.

## 11

౧ పిల్లలమఱ్ఱి : (నల్లగొండజిల్లా) సోమేశ్వరాలయ స్తంభముమీద.

౨ కాపయనాయనింగారు

౩ హేవిళంబి

౪ తెలుఁగు

౫ ఈతని భృత్యుడగు ఎఱపోతు లెంకధర్మము నీశాసనము దెలుపుచున్నది. కాపయనాయని బిరుదములు గమనింపదగినవి. ఎఱపోతు లెంకతండ్రియని చెప్ప బడిన అనుమకొండ మాచినాయనింగారికిని, కాకతీయప్రతాపరుద్రుని భృత్యుడగు అనుమకొండ అంన్ను వెంకకు నేమైన సంబంధ ముండెనేమో తెలియుటలేదు. కాపయనాయకుడు కాకతీయ రాజ్యమున పిల్లలమఱ్ఱి ప్రాంతమున కధిపతియై యుండును.

## 12

౧ కొలను : (వరంగల్ జిల్లా)

౨ చాళుక్యభీముఁడు

౩ *

౪ తెలుఁగు

౫ ఈశాసనము వేంగీచాళుక్య చరిత్రమునకు ముఖ్యమైనది. పూర్వభాషాపదములు పెక్కులిందుగలవు. ఇందలి రణమర్దాన్వయమును, కుసుమాయుధుఁడు నెవ్వరో తెలియదు. కొలనురాజ్యప్రశంస యిందు గలదు. ఈశాసనము తొమ్మిదవ శతాబ్దమధ్యభాగము నాటిది.

## 13

౧ గూడూరు : (వరంగల్ జిల్లా) గ్రామమధ్యమున.

౨ మల్లుడు

౩ *

౪ కన్నడము

౫ విరియాలవంశమునసూరడు నాతనికి బేతనయునతనికి బెజ్జమాంబికయందు మల్లనయు జనించిరని యీ శాసనమునుండి తెలియుచున్నది. వారికిని కాకతీయశాసనములలో విర్యాలనాగసానమ్మకు నేమైన సంబంధ ముండెనేమో తెలియదు. కాకతీయ ౫౫, చాళుక్య ౩౫, శాసనములును ఇదియు ఒకేశిలపై నున్నవి.

## 14

౧ ఇనుగుర్తి : (వరంగల్ జిల్లా) జియ్యరుస్వామిగారి యింట్లో.

౨ బయ్యాంబిక

౩ *

౪ సంస్కృతము.

౫ ఇందలి విరియాలబయ్యాంబికకును, నెం. ౧౩ రు. శాసనమున బేర్కొనబడిన విర్యాలవంశజులకును, విర్యాలనాగసానమ్మకునుఁగల సంబంధ మేమియో తెలియుటలేదు. శాసనముపలుతావులచెడియున్నది. మధ్య కల్వము చెక్కబడినది.

## 15

౧ బూరుగుగడ్డ : (మహబూబునగరుజిల్లా) శివాలయములో.

౨ అంనపునాయనింగారు

౩ శా. శ. ౧౩౦౦

౪ తెలుఁగు

౫ ఈ యంనమనాయనింగారు సితనితంఁడ్రి యన భీమానాయనింగారును, కాకతీయులకు పిమ్మట నుత్తరాంధ్రదేశము నేలిన పద్మనాయక వెలమల లోనివారయి యుందురు.

## 16

౧ మధిర : (వరంగల్ జిల్లా)

మధిరమహాదేవపురము త్రోవలోని చేలో.

౨ నరసింహుడు

౩ శా. శ. ౧౧౧౨

౪ సంస్కృతము

౫ తెనాలిపురవాస్తవ్యుడును, నారసింహుని పౌత్రుడును, బ్రహ్మాభిధాని పుత్రుడునగు నారసింహుని దానశాసనము. ఈ బ్రాహ్మణకుటుంబమునుగూర్చి యింకేమియును దెలియుటలేదు.

## 17

౧ లింగగిరి : (కృష్ణాజిల్లా)

౨ *

౩ శా. శ. ౧౧౪౨

౪ తెలుఁగు

౫ క్రీ॥ శ. ౧౨౨౦ లో లింగగిరిలో ఎంబెరుమానారు మఠము స్థాపింపఁబడినట్లును మఠమునకు ఆర్థికసహాయము కొఱకు రాజమఠము కొల్వ ఏర్పరుపబడినట్లును అస్పష్టముగఁ దెలియుచున్నది.

## 18

౧ పానుగల్లు : (నల్లగొండజిల్లా)

గోరీలవద్ద

౨ మేలాంబిక

౩ చా. వి. శ. ౭౪

౪ సంస్కృతము

౫ మేలాంబికకు ముప్వురుపుత్రులుండిరని తెలియుచున్నది. ఉదయాదిత్య భీమ గోకర్ణులనామములు గూడ గలవు. వీరామెకు పుత్రులో యేమో తెలియలేదు. వేఱొకచో నుదయాదిత్యునకు భీమ గోకర్ణులు పుత్రులని మామిళ్ళపల్లి శాసనము తెలుపుచున్నది. ప్రతిబింబము బాగుగలేదు.

## 19

౧ నగునూరు : (కరీంనగరముజిల్లా)

ఊరిబయటనున్న శక్తిఆలయమునకు ఎదుట విగ్రహములదగ్గర

౨ గణపతిదేవమహారాజు

౩ సర్వజిత్తు

౪ తెలుఁగు

౫ ఆ మల్లిసెట్టి, ఆయన కొడుకు వెన్నిసెట్టిచేసిన దానము. వీరు హరేశ్వరదేవరప్రతిష్టను గణపతిదేవ మహారాజుపేర గణపేశ్వరమును, సకల భక్తులపేర సకలేశ్వరమును ప్రతిష్ఠ చేసినట్లు ఈ శాసనము తెలుపుచున్నది. ఈగణపదేవుఁ డెవఁడో తెలియుటలేదు. చాళుక్య ౧౪ వ శాసనము నిదియు నొక్క శిలమీద నే యున్నవి.

## 20

౧ అలంపురము : (రాయచూరుజిల్లా)

బ్రహ్మేశ్వరుని గుడినుండి తుంగభద్రకు పోవు త్రోవ ప్రక్క గోడలో.

౨ విజయాదిత్యుఁడు

౩ శా. శ. (౬౨౬)

౪ సంస్కృతము

౫ ఇది బాదామి చాళుక్యుల శాసనము. శిలపంక్తుల చిగురుభాగమునం దరిగిపోయినది. కొల మాయ బడినచోటగూడ నటులే యున్నది. పూర్వచాళుక్య చరిత్రమున కిది మిగుల ముఖ్యమైనది.

## 21

౧ వేములవాడ : (కరీంనగరముజిల్లా)

౨ అరికేసరి

౩ *

౪ సంస్కృతము

౫ చాళుక్యవంశమున జనించినవినయాదిత్యనామధేయు డగు యుద్ధమల్లుడు చిత్రకూటదుర్గమునుఁ గైకొనెను అతని కుమారుఁడగు నరికేసరి వేంగీదేశమును బలముచే నాక్రమించె. అతనికి నరసింహభూపతియు నతనికి రాజాదిత్యుడు నాతనికి రెండవయుద్ధమల్లుడును జనించిరి. అనంతరము రెండవ నరసింహదేవుడు పుట్టి గూర్జరసైన్యములను జయించి యుండెను. ఇతనికి రెండవ యరికేసరి యుదయించెను. మహాసేనావృతుడయినయాతడు గోవింద రాజురాజ్యము నపహరించి, బిజ్జని రక్షించెను. ఈతని బిరుదములనుండి యాతడు త్రిభువనమల్లుని సామంతుడని తెలియుచున్నది. ఈతనికి గుణకశర్మ యనునాతడు మంత్రియు సన్ధివిగ్రహియునైయుండెను. బద్దిగభూపాలుని మనుమడగు తంత్రపాల పెద్ద నార్యునికోరికను మన్నించి అ × లపాలకపట్టణమునం దరికేసరి భూదాన మొనర్చెను. ఇందలి గోవిందరాజు, పశ్చిమచాళుక్య దండనాయకుడుగను, బిజ్జడును ఆంధ్రచోడసామంతులలో నొక్కరుడుగను, నిర్వచనోత్తరరామాయణమున తెనుంగ బిజ్జనామమున బేర్కొనబడియు నుండిన బిజ్జనచోడమహారాజని చెప్పవచ్చును. ఈ బద్దెన యెవ్వరో తెలియరాదు. పై నుదహరింపబడినవారందరును చాళుక్యవిక్రమాదిత్యుని కాలమునం దుండినవారు. ఈ శాసనము వేంగీచాళుక్య, అంధ్రచోడవంశములకు చాల ముఖ్యమైనది.

## 22

౧ దోసపాడు: (నల్లగొండజిల్లా)
గుండ్లపల్లెసాటుమీది పాడుదేవాలయ స్తంభము మీద.
౨ *
౩ శా. శ. ౧౧౧౨
౪ తెలుఁగు
౫ దోసపాటి రుద్రయ్య హరిహరదేవునికి తనతండ్రి గుండ్రెడ్డికి, తనతల్లి కామసానికి పుణ్యము గానిచ్చిన ధర్మమును దెలుపును.

## 23

౧ నాగులపాడు: (నల్లగొండజిల్లా)
౨ రామరాజుమేడ్రాజు
౩ శా. శ. ౧౪౦౪
౪ తెలుఁగు
౫ గోలకొండరాజ్యమునకు ముందు వెలమవారివద్ద రాజప్రతినిధిగానుండి సూర్యాపేటతాలూకాలోని భాగములను రామరాజు మేడరాజు పాలించినటుల దత్రత్యులు చెప్పుచున్నారు. ధర్మస్థాపకుఁడయిన అక్కనకు మేడరాజునకుగల రాజకీయసంబంధము తెలియుట కవకాశములు లేవు. చాళుక్య ౧౩ వ శాసనములోను, మేడరాజు ప్రసంగము కలదు.

## 24

౧ ముదిమాణిక్యము: (మెదకుజిల్లా)
భోగేశ్వరస్వామిగుడిలో.
౨ మల్లిశెట్టి
౩ శా. శ. ౧౨౫౮
౪ సంస్కృతము
౫ తటాకనిర్మాణప్రశంస యీ శాసనమునఁగలదు.



## KAKATIYA INSCRIPTIONS

| No. | Place | King | Date | Language | Remarks |
|---|---|---|---|---|---|
| 1 | Near the Police outpost, **Kazipet** in the Warangal Dist. | Prola | ... | Canarese | Registers the gift of Prola son of Beta of Durjaya family. |
| 2 | Do. do. do. | Do. | ... | Do. | Mentions that Mahamandalesvara Kakatiya Betesa instituted Varuna for the merit of his father Polarasa. |
| 3 | Near the idol of Bhairava in a cave at **Inugurti,** in the Warangal Dist. | Do. | ... | Telugu | Mentions that Prola instituted Jalandhara Bhairava on a hill at Inugurti. |
| 4 | At **Materu** in the Warangal Dist. | Do. | S. 1043 | Do. | Registers the gift of a certain Mallenayaka subordinate of Mahamandalesvara Kakatiya Prola Raja. |
| 5 | At **Anumakonda** in the Warangal Dist. | Rudra | S. 1084 | Sanskrit and Telugu | This is the famous record edited by Dr. Fleet in Indian Antiquary, vol. XI P. 10 and is the bed-rock of Kakatiya history. |
| 6 | At **Karimnagar** in the Karimnagar Dist. | Do. | S. 1092 | Telugu | Written in beautiful Telugu verse, this record mentions the many deeds of piety of Gangadhara, a minister of Rudra and one of the palace officials in the time of Prola. It shows that the Buddhist and Jain Cults were prevalent at that time and also gives many topographical details about Anumakonda and its neighbourhood. |
| 7 | On a pillar at **Pillalamarri** in the Nalgonda Dist. | Do. | S. 1117 | Sanskrit and Telugu | Registers a gift of Recherrula Nami Reddi son of Kama and Kachamba, to the three gods instituted by him after the names of his parents and of himself. He calls himself a subordinate of Rudra who is said to have been ruling in the year of the gift, which is probably the last year of the monarch. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 8 | At **Kondiparti** in the Warangal Dist. | Ganapati | S. 1113 ? 1125 | Sanskrit | Registers the gift of Chaunda Senani of the Malyala family and a general of Ganapati. His pedigree is thus given:—<br>DANNA<br>\|<br>SAJJA<br>\|<br>*<br>(a general of Kakati Rudra)<br>\|<br>Pota. — Chaunda (The donor) |
| 9 | On a pillar at **Pillalamarri** in the Nalgonda Dist. | Do. | S. 1124 | Sanskrit & Telugu | Registers the gift of Nami Reddi to the various gods at Pillalamarri and enumerates his titles. It also depicts the following geneology of the Recherla family:—<br>BAMMA<br>\|<br>MUCCHA<br>\|<br>KATA<br>\|<br>KAMA = Kachamba.<br>\|<br>NAMA = Itama. |
| 10 | At **Nagulapadu** in the Nalgonda Dist. | Do. | S. 1124 | Telugu | Registers a gift of Nami Reddi. |
| 11 | At **Pillalamarri** in the Nalgonda Dist. | Do. | S. 1130 | Sanskrit & Telugu | Registers a gift of Eraka Sani wife of Recherla Beti Reddi. |
| 12 | At **Annavaram** in the Nalgonda Dist. | Do. | S. 1130 | Telugu | Registers the gift of Recherla Kami Reddi son of Itambika. |
| 13 | At **Vadapalli** in the Nalgonda Dist. | Do. | S. 1133 | Do. | Registers the joint gift of Komare Nayaka Bete Nayaka and Rudra Nayaka for the merit of their father Kata Nayaka and their overlord Ganapati Deva Maharaja. |
| 14 | In an old temple at **Somavaram** in the Nalgonda Dt. | Do. | S. 1135 | Telugu | Registers a gift for the merit of Recherrula Beti Reddi. |

KAKATIYA INSCRIPTIONS—*contd.*

| No. | Place | King | Date | Language | Remarks |
|---|---|---|---|---|---|
| 15 | At **Somavaram** in the Nalgonda Dist. | Ganapati | S. 1156 | Telugu | Registers a gift of Resarle Nami Reddi for the merit of his parents and of himself. |
| 16 | In an old shrine at **Nagulpadu** in the Nalgonda Dist. | Do. | S. 1156 | Do. | Registers the gift of Mandalika Recherla Katreddi, son of Nami Reddi and Itasanamma, for the merit of himself and his parents in the reign of his overlord Ganapatideva. |
| 17 | In the ruined fort of **Kondiparti** in the Warangal Dist. | Do. | S. 1162 | Sanskrit | Mentions that Kata Chamupati of the Malyala family instituted the gods Prolesvara, Achutesvara and Rudresvara. His pedigree is given in this record. |
| 18 | Near a ruined Siva shrine at **Ganapavaram** in the Nalgonda Dist. | Do. | S. 1175 | Do. | Mentions a Jagaddeva whose son was Devabhupala and says that after Jagaddeva, Kakati Prola ruled the kingdom. Ganapati, his father Mahadeva and uncle Rudra are also mentioned. |
| 19 | At **Nagulapadu** in the Warangal Dist. | Do. | S. 1180 | Telugu | Registers the gift of Recherla Kami Reddi son of Itambika and enumerates the titles of this family of Kakatiya feudatories. |
| 20 | In a mosque at **Budapur** in Mahaboob Nagar Dist. | Do. | S. 1181 | Sanskrit & Telugu | Records the building of two temples by Malyala Gundaya, a general of Ganapati. This record is of very great importance to Kakatiya history, since it clearly and definitely mentions that the Kakatiyas were of the fourth caste. |
| 21 | Do. | Do. | S. 1184 | Do. | Mentions that Malyala Gundaya built a tank in the name of Ganapati and gave it to brahmins. It also gives the following pedigree of Gundaya's family:— Danna. \| Java. \| Gunda. } This record further states that Ganapati was associated with the Government of the country even while Rudra was alive. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 22 | At **Warangal** near Khan Saheb Garden | Ganapati | Sarva-dharin | Telugu | Mentions that the king remitted the taxes collected over several articles of merchandise in favour of God Virabhadresvara. It throws much light on the economic conditions of those times. |
| 23 | At **Muppavaram** in the Warangal Dist. | Do. | ... | Telugu | Mentions that Malli Reddi, son of Panta Bolli Reddi instituted God Ramesvaradeva. This is the earliest evidence of the existence of the Panta family of Reddis. |
| 24 | At **Mattevada** in the Warangal Dist. | Do. | ... | Do. | Mentions some new birudas of the king. |
| 25 | At **Somavaram** in the Nalgonda Dist. | Do. | Durmati | Do. | Registers a private gift. |
| 26 | Do. | Do. | ... | Do. | Registers a private gift for the joint merit of Ganapatideva Maharaja and Recherrula Ruddu Raddi. |
| 27 | On a slab at **China Kandukur** in the Warangal Dist. | Do. | Subhakrit | Do. | Registers a private gift. |
| 28 | Do. | Do. | Vibhava | Do. | Do. |
| 29 | At **Nagulapadu** in the Nalgonda Dist. | Do. | Raktakshi | Do. | Registers the joint gift of Ganapi Reddi and Marreddi for the merit of their parents Kami Reddi and Kamasani and of themselves. |
| 30 | Do. | Do. | Raktakshi | Telugu | Registers the joint gift of Kamaya, Namaya and Mallaya, for the merit of their parents Katreddi and Para sani; it also mentions the individual gifts of Namaya & Kamaya in the year Kshaya. Evidently Mallaya was dead by this time. |
| 31 | At **Pammi** in the Warangal Dist. | Ganam Rudra-Deva-Maha-Rajah | S. 1156 | Telugu | Registers a gift of Mahasamanta Viryala Nagasanamma garu on the occasion of the institution of god Prasanna Vallabha by Devanapreggada. This record gives many interesting details about temple administration in those times. |
| 32 | In the Narasimha temple at **Burugugadda** in the Nalgonda Dist. | Rudra-Deva-Maha-Rajah | S. 1180 | Do. | Registers the gift by a brother of Satramu Bollamaraju, a minister of the queen. The invocatory verse in this inscription indicates the prevalence of Sri Vaishnava faith at this time. |

KAKATIYA INSCRIPTIONS—*contd.*

| No. | Place | King | Date | Language | Remarks |
|---|---|---|---|---|---|
| 33 | At **Panugal** in the Nalgonda Dist. | Rudra Deva-Maharajah. | ... | Telugu | Registers the gift of Tantrapala Mallinayaka. Evidently a record of the time of Rudramba. |
| 34 | Do. | Do. | S. 1187 | Do. | Registers the gift of Praudha Pratapa Chakravarti Sarangapani Deva to god Chaya Somanatha Deva of Panugal. This chieftain is a subordinate of Ganapati & Rudramba and ruler of Panuganti-Sthala, and an enemy of Devarada Bhupati, Jajjaladeva and Bhoja Raja. |
| 35 | At **Panugal** in the Nalgonda Dist. | Pratapa-Rudra | S. 1213 | Telugu & Sanskrit | Registers a gift of Sarangapanideva, a feudatory. Useful for the determination of the commencement of the monarch's reign. |
| 36 | At **Budapur** in the Mahaboob Nagar Dist. | Rudra-Deva-Maha-rajah | S. 1198 | Do. | Mentions that Kuppambika, wife of Malyala Gundaya, a subordinate of the queen, instituted a Linga in honour of her dead husband and made elaborate provision for the worship of the god. She was born in the "Gona" family. The poet Isvara Bhattopadhyaya is said to have composed the inscription. |
| 37 | At **Pamapuram** in the Mahaboob Nagar Dist. | Do. | S. 1200 | Telugu | Mentions that a certain Videmu Madaya granted the "Sunkamu" of the village of Ponnamuccha to god Ramanathadeva. |
| 38 | Do. | Do. | S. 1200 | Do. | Registers a gift of the local taxes (Sunkamu) by a certain Annama Raju. |
| 39 | In the Scmanadha temple at **Kolanupaka** in the Nalgonda Dist. | Do. | ... | Sanskrit | Registers the gift of a certain Poti Nayaka, a servant of the Kakatiyas. This inscription is of paramount importance to Kakatiya history. It gives the geneology from Prola to Rudramba, mentions that the latter was the daughter of Ganapati, and that Virabhadra son of Indusekhara of the Chalukyan family, was her husband. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 40 | At **Burugugadda** in the Nalgonda Dist. | ... | ... | Telugu | A private gift. Enumerates the temple staff. |
| 41 | Do. | ... | ... | Do. | Registers the gift of a certain Ammajiyya Ganapaddeva who bore the titles "Sarvalokasraya" and "Vishnu Vardhana Chakravarti". |
| 42 | Do. | ... | ... | Do. | The concluding portion mentions a Mahamandalesvara with the usual Telugu choda titles and calls him "Lord of Konduri Pura". |
| 43 | In the Vishnu temple at **Ganapavaram** in the Nalgonda Dist. | Pratapa-Rudra | S. 1214 | Telugu | Registers a gift of Gangidevaningaru, a minister of the king. The king is here called "Pratapa Kumara Rudradeva." |
| 44 | At **Gajagatlapalli** in the Medak Dist. | ... | ... | Telugu | A scatterred piece, to be read along with No. 45. |
| 45 | At **Manur** in the Medak Dist. | Pratapa-Rudra. | S. 1216 | Do. | Registers the joint gift of Videmu Rudradeva and Anumakonda Annuvenka, two subordinates of the king. These persons also figure in the local Records of the Kurnool District, in connection with Pratapa Rudra's economic re-organisation of that region. |
| 46 | At **Alampur** in the Raichur Dist. | Do. | S. 1221 | Do. | Registers a gift by several settis, professing the cult of Virabhadra. |
| 47 | At **Nagulpadu** in the Nalgonda Dist, | Do. | S. 1225 | Do. | Registers a gift of the eighteen communities of the locality, for the merit of the king. |
| 48 | In the Anjaneya temple at **Tekmal** in the Medak Dist. | Do. | S. 1230 | Do. | Registers the gift of Puravari Mahadeva Nayankulu the Mahapradhani of the king. |
| 49 | At **Maturu** in the Warangal Dist. | Do. | S. 1232 | Do. | An incomplete record. |
| 50 | In the Svayambhu temple at **Mella-Cheruvu** in the Nalgonda Dist. | Do. | S. 1233 | Do. | Records a gift of several communities of the place. |
| 51 | At **Warangal** in the Warangal Dist. | ... | ... | Sanskrit | Mentions that Prola was born in the Kakatiya family. Incomplete. |
| 52 | Do. | ... | ... | Do. | The earlier part evidently refers to Prola's father and mentions Prola and his son Mahadeva. A certain Upamanyu Muni and a Dhruvesvara Munisvara, a saivite teacher, are also mentioned. |

## KAKATIYA INSCRIPTIONS—*concld.*

| No. | Place | King | Date | Language | Remarks |
|---|---|---|---|---|---|
| 53 | In **Rudresvara** temple at **Hanumakonda** in the Warangal Dist. | ... | ... | Telugu | Mentions that a certain Gosagi Isvaradeva instituted a number of gods for the prosperity of the kingdom of the "Kakatiyas" who were his overlords. |
| 54 | At **Maturu** in the Warangal Dist. | ... | S. 1041 | Do. | Mentions that a subordinate of Tribhuvanamalla, restored to the Kakatiyas, the Andhra kingdom, which was usurped by their cousins. The significance of this important fact deserves careful consideration. |
| 55 | At **Guduru** in the Warangal Dist. | ... | ... | Do. | Gives the following geneology of a Durjaya family:— VENNA \| ERRA = Kamasani. Mentions that Erra took up the cause of Botta Beta and instituted him as lord of the Koravi country. His wife made him the Kakati Vallabha. This inscription brings to light startling facts about the origin of the Kakatiyas and deserves very careful consideration. |
| 56 | At **Dharmasagar** in the Warangal Dist. | Ganapati Rudra Deva | S. 1128 | Sanskrit and Telugu | A much damaged record registering the gift of a minister of the queen. |
| 57 | At **Inugurti** in the Warangal Dist. | Rudra | ... | Sanskrit | Describes the geneology of the family and registers the charities of Rudra. This record is in the Devanagari script. |

# CHALUKYAN INSCRIPTIONS

| No. | Place | King | Date | Language | Remarks |
|---|---|---|---|---|---|
| 1 | At **Gangapur** in the Mahaboobnagar Dist. | Jagadekamalla | 18 year | Canarese | Registers a private gift. |
| 2 | Do. | Do. | 8 year | Do. | Registers a private gift. |
| 3 | At **Kolanupaka** in the Nalgonda Dist. | Do. | ... | Do. | Registers a gift of Maneverggade. |
| 4 | Do. | Do. | ... | Do. | Mentions the minister Manmaverggade. |
| 5 | At **Gangapur** in the Mahaboob Nagar Dist. | Do. | Dhatu | Do. | Registers a gift of some settis. |
| 6 | At **Alampur** in the Raichur Dist. | Trailokya malla | C. V. E. 83 | Do. | Registers a private gift. |
| 7 | In the Virabhadra temple at **Dakur** in the Medak Dist. | Do. | S. 1013 3rd year | Do. | Registers a gift of Mahamandalesvara Sopermadi. |
| 8 | At **Nambulakunta** in the Mahaboob Nagar Dist. | Do. | ... | Do. | Mentions that a certain Mallahinidevi daughter of Mahamandalesvara Sankarasadevachoda, a member of the Telugu choda family, made a gift. |
| 9 | At **Alampur** in the Raichur Dist. | Do. | ... | Do. | Incomplete Mentions Mahamandalesvara Nirugani Chola Maharaja, the king's feudatory and evidently member of a Telugu choda family. |
| 10 | Do. | Do. | ... | Do. | Incomplete-Mentions Mahamandalesvara Biddna Choda Maharaja, a feudatory evidently of Telugu choda lineage. |
| 11 | Do. | Bhuvanaika malla | C. V. E. 88 | Do. | Registers a gift of the minister Vadderavula, Dannayaka to god Brahmesvaradeva of Alampura. |
| 12 | Do. | Tribhuvana malla | C. V. E. 1 | Do. | Registers the gift of a Telugu choda feudatory of the king. |

## CHALUKYAN INSCRIPTIONS—*contd.*

| No. | Place | King | Date | Language | Remarks |
|---|---|---|---|---|---|
| 13 | In the Bhimesvara temple at **Vemulavada** in the Karimnagar Dist. | Tribhuvana malla | C.V.E. (2) | Do. | Registers a gift of Kumara Somesvara. Also mentions a Jagaddeva. |
| 14 | At **Alampur** in the Raichur Dist. | Do. | C.V.E. (2)3 | Do. | Records a private gift made in the region which was under the rule of Dharanindrarasi pandita. |
| 15 | At **Gangapur** in the Mahaboob Nagar Dist... | Do. | C. V. E. 3 | Do. | Records a private gift. |
| 16 | Do. | Do. | C. V. E. 3 | Do. | Records a private gift. |
| 17 | In a ruined temple at **Nagunur** in the Karimnagar Dist. | Domme Raju | Pramadi | Telugu | Mentions that Mahamandalesvara Domme Raju, Medaraju and Jagaddevudu won a victory over an army of 80,000. These persons may be identical with the Kakatiya rivals mentioned in the Anumakonda inscription of Rudra. |
| 18 | At **Alladurg** in the Medak Dist. | Tribhuvana malla | C. V. E. 8 | Canarese | Registers a gift of Ahavamalla permadi. |
| 19 | At **Vemulavada** in the Karimnagar Dist. | Do. | Do. | Do. | Registers a gift of Mahamandaleswara Raja-Dityarasa. |
| 20 | At **Alampur** in the Raichur Dist. | ... | C. V. E. 11 | Do. | Registers a gift of Somesvararasibhattaraka. |
| 21 | In the Viranarayana temple at **Kolanupaka** in the Nalgonda Dist. | Do. | C. V. E. 13 | Do. | Registers the gift of a Telugu Choda subordinate of the king, ruling at Kandur. |
| 22 | At **Gangapur** in the Mahaboob Nagar Dist. | Do. | C. V. E. 16 | Do. | Records the gift of Sakalapravesabhattaraka the king's preceptor, to Adityabhattopadhyaya an eminent astrologer, for the merit of the king. |
| 23 | At **Kolanupaka** in the Nalgonda Dist. | ... | C. V. E. 22 | Do. | Name of Donor lost. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 24 | At **Gangapur** in the Mahaboob Nagar Dist. | Tribhuvana malla | C. V. E. 23 | Canarese | Records the gift of a W. Chalukyan general. |
| 25 | At **Alampur** in the Raichur Dist. | Do. | C. V. E. 26 | Do. | Registers a gift of the queen Mannadevi |
| 26 | Do. | Do. | C. V. E. 26 | Do. | Registers a gift of Mahamandalesvara Mallamaharaja. |
| 27 | At **Gangapur** in the Mahaboob Nagar Dist. | ... | C. V. E. 28 | Do. | Records a gift by the inhabitants of the place to god Halesveradeva. |
| 28 | At **Pudur** in the Mahaboob Nagar Dist. | Tribhuvana malla | C. V. E. 29 | Do. | Registers the gift of Pudura Hallakarasa to his Jain teacher Kanaka sena bhattaraka of the Pallava Jinalya. |
| 29 | At **Kolanupaka** in the Nalgonda Dist. | Do. | C. V. E. 30 | Do. | Registers a gift of the generals Banasurverggade and Anantapalayya. |
| 30 | At **Alampur** in the Raichur Dist. | Do. | C. V. E. 39 | Do. | Registers a gift of Mahamandalesvera Mallarasa who is called "Lord of Kodur". |
| 31 | Do. | Do. | C. V. E. 39 | Do. | Records a gift by one of the Queens. |
| 32 | At **Gangapur** in the Mahaboob Nagar Dist. | Do. | C. V. E. 41 | Do. | Registers a joint gift by Somaladevi, Bhimarasa & Gangadevi of Kodur. |
| 33 | At **Nekkonda** in the Mahaboob Nagar Dist. | Do. | C. V. E. 46 | Do. | Registers a gift of Kumara Tailpadeva ruler of Kodur, his wife Lakshmadevi & prince Permadi. Taila's titles "Ripukula-Ravi" and "Rudra-Vidravana" indicate his hostility with Kakati Rudra, mentioned in the Anumakonda record. |
| 34 | At **Budapur** in the Mahaboob Nagar Dist. | Do. | Do. | Do. | Do. |
| 35 | At **Gudur** in the Warangal Dist. | Do. | C. V. E. 47 | Do. | Mentions that while Kumara Somesvara was ruling, a gift was made by him at the request of the minister Maneverggade and Dandanayaka Sahipayya. Somesvara's titles are noteworthy. |
| 36 | At **Kolanupaka** in the Nalgonda Dist. | ... | C. V. E. 50 | Do. | Registers the gift of Maneverggade while Kumara Somesvara was ruling at his capital Kottipaka. |
| 37 | At **Panagal** in the Nalgonda Dist. | Tribhuvana malla | ... | Sanskrit | Mentions that a certain Vaidyanatha brother of Bhima, got some territory from Tailapadeva son of the Emperor. |

CHALUKYAN INSCRIPTIONS—*concld.*

| No. | Place | King | Date | Language | Remarks |
|---|---|---|---|---|---|
| 38 | At **Burugugadda** in the Nalgonda Dist. | Tribhuvana malla | ... | Canarese | Mentions Kumara Somesvara, the minister Banasu Veryggade and Dandanayaka Anantapalayya. |
| 39 | At **Tadikonda** in the Mahaboob Nagar Dist. | Bhulokamalla | 3 year | Do. | Registers a private gift. |
| 40 | At **Gangapur** in the Mahaboob Nagar Dist. | Do. | 8 year | Do. | Mentions that a general of Tailapadeva remmitted the taxes "Vadderavula" and "Herjunka" in favour of god Somanathadeva. |
| 41 | At **Korapolu** in the Nalgonda Dist. | Ahavamalla | S. 99 | Do. | Registers a gift by Lakshmibarasi and Sopermadi to god Bilesvaradeva. |
| 42 | At **Kolanupaka** in the Nalgonda Dist. | Tribhuvana malla | C. V. E. 29 | Sanskrit | Mentions a gift of Somala Dandanayaka and Sopermadi. This record is of much importance for W. Chalukyan history and makes mention of the Guzerat branch of the chalukyas also. |

# MISCELLANEOUS INSCRIPTIONS.

| No. | Place | Donor | Date | Language | Remarks |
|---|---|---|---|---|---|
| 1 | On the eastern gateway in the stone wall, **Warangal** fort. | Racchi-deva Kumara Maha Patra. | Pramadi | Telugu | Mentions that this chieftain who was the son of Kapilendra Gajapati, captured the fort of Warangal. |
| 2 | In the Telugu library at **Nela-kondapalli** in the Warangal Dist. | Mahamandalesvara Kanduri Rudrayana Choda. | S. 1047 | Do. | Registers a private gift. Evidently this chieftain belonged to the Kandur branch of the Telugu Cholas. |
| 3 | Do. | Krishnaraya of Vijayanagara. | S. 1473 | Do. | Registers the gift of Rayasam Kondamarasamgaru, the King's Viceroy over the Pedakondapalli province. |
| 4 | At **Nagulapadu** in the Nalgonda Dist. | Yelesukhan. | S. 1467 | Do. | Registers the gift of some Reddis. |
| 5 | At **Panagal** in the Nalgonda Dist. | ... | ... | Sanskrit | Mentions Mailambika and Tanda kshitisa, son of Bhima Raju. |
| 6 | At **Jetcherla** in the Mahboob Nagar Dist. | Kanduri Odayana Deva Choda. | S. 1084 | Telugu | Registers the gift of " Sthalamu Sunkamu " of Gangapur to god Somanatha by Melvatte Dandanayaka, Yerra Siddha and Nalla Siddha the customs officers of the chieftain, who evidently belonged to the Kandur branch of the Telugu chodas. Makes mention of coins called " Gokarnasinga." |
| 7 | At **Alugadapa** in the Nalgonda Dist. | Errama Nayaningaru. | S. 1128 | Do. | Mentions that he was the co-son-in-law of Gundapa Nayaningaru who had the titles " Suryodaya rajya samuddharana " and " Vadluri pura vara dhisvara ". |
| 8 | At **Gangapur** in the Mahboob Nagar Dist. | Venna Mahipati. | ... | Sanskrit | Mentions that he belonged to the fourth caste This record may be useful for the history of Padmanayakas. |

MISCELLANEOUS INSCRIPTIONS—*contd.*

| No. | Place | Donor | Date | Language | Remarks |
|---|---|---|---|---|---|
| 9 | At **Ramannapeta** in the Warangal Dist. | Malreddi | S. 1135 | Telugu | Mentions that this chieftain instituted God Visvesvara at Matur for the merit of his father Muppa Reddi. |
| 10 | At **Garla** in the Warangal Dist. | Boppa-Raya. | S. 1209 | Sanskrit | It gives the following pedigree :—<br>Beta<br>(of the Recherla family in the fourth caste.)<br>\|<br>Boppa<br>\|<br>Gana nadha<br>\|<br>Boppa<br>(the Donor) |
| 11 | At **Pillalamarri** in the Nalgonda Dist. | Kapaya-nayanim-garu. | Hevilambi | Telugu | Mentions that his subordinate Erapautu-Lenka who was ruling at Pillalmarri, re-instituted God Erakesvara who was broken by the Sultan, for the merit of his overlord and of his own parents. |
| 12 | At **Koravi** in the Warangal Dist. | Chalukya Bhima. | ... | Telugu | Mentions a Kusumayudha of Ranamardanvaya and the Koravi country. This is very important for the history of the Eastern chalukyas. |
| 13 | At **Gudur** in the Warangal Dist. | Malla. | ... | Canarese | Gives the following pedigree of a Viryala family—<br>Sura<br>\|<br>Beta = Bejjama<br>\|<br>Malla |
| 14 | At **Inugurti** in the Warangal Dist. | ... | ... | Sanskrit | Mentions Viryala Bayyambika. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 15 | At **Burugugadda** in the Mahboob Nagar Dist. | Annama Nayaningaru. | S. 1300 | Telugu | Mentions that he instituted God Ramesvara for the merits of his father. |
| 16 | At **Mathira** in the Warangal Dist. | ... | S. 1112 | Sanskrit | Mentions that a certain Narasimha instituted several gods and gave them many presents. The donor's pedigree is thus given—<br>Narasimha = Nagamba<br>(inhabitant of Tenali)<br>\|<br>Brahma = Koppa<br>\|<br>Narasimha<br>(the donor) |
| 17 | At **Lingagiri** in the Krishna Dist. | ... | S. 1142 | Telugu | Reveals the existence of Sri Vaishnava cult in this part of the country in the 13th century. |
| 18 | At **Panagal** in the Nalgonda Dist. | Melambika. | C.V.E. 84 | Sanskrit | Mentions that Melambika had three sons; Udayaditya, Bhima and Gokarna also figure in this record. |
| 19 | At **Naganur** in the Karimnagar Dist, | Ganapathi | Sarvajit | Telugu | Records charities made in the name of Ganapatideva. |
| 20 | At **Alampur** in the Raichur Dist. | Vijayaditya. | S. (626) | Sanskrit | A record of the Early Chalukyas of Badami. Much damaged. |
| 21 | **Vemulavada** in the Karimnagar Dist. | Arikesarin. | ... | Do. | Records the exploits of Arikesari II a subordinate of Vikramaditya VI and a Scion of the Vengi branch of Chalukyas. This record is of paramount importance for Eastern Chalukyan history and needs careful consideration. |
| 22 | At **Dosapadu** in the Nalgonda Dist. | ... | S. 1112 | Telugu | Registers a private gift. |
| 23 | At **Nagulapadu** in the Nalgonda Dist. | Medraju. | S. 1404 | Do. | Do. |
| 24 | At **Mudimanikyam** in the Medak Dist. | Malli Setti | S. 1258 | Sanskrit | Records the construction of a tank. |

# లక్ష్మణరాయ పరిశోధక మండలి

## హైద్రాబాదు : దక్కన్

అధ్యక్షులు

1. శ్రీ శ్రీ రాజా నాయని వేంకట రంగారావు బహద్దరు గారు,
మునగాల సంస్థానాధీశులు, నడిగూడెము—కృష్ణాజిల్లా.

సభ్యులు

2. శ్రీయుత సిరుగూరి హనుమంతరావు గారు, ఎం ఏ., ఎల్. టి.,
ప్రొఫెసరు-నిజాం కాలేజి, హైద్రాబాదు.

3. ,, మాడపాటి హనుమంతరావు గారు, హైకోర్టు వకీలు, హైద్రాబాదు.

4. ,, రాజా బహద్దరు పిల్లె గారు, బి. ఏ., బి. ఎల్., హైకోర్టు వకీలు, సికింద్రాబాదు.

5. ,, సురవరం ప్రతాపరెడ్డి గారు, బి. ఏ., బి. ఎల్., హైకోర్టు వకీలు, హైద్రాబాదు.

గౌరవకార్యదర్శి

6. పండిత ఆదిరాజు వీరభద్రరావు గారు,
78 ముస్లింజంగు బాగు, హైద్రాబాదు.